# విజ్ఞప్తి.

ఆర్యులారా!

ఆంధ్రదేశంబునందుగల విద్యాశాఖాధికారులు క్రొత్త పద్ధతుల ప్రకారము ఎలిమెంటరీ స్కూళ్లలోని బాలురకు నాటక మూలమున కథాసందర్భములను బోధపఱచవలెననియును, దానిచే బాలురు విలాసముతో తాము నేర్వవలసిన విషయములను సులభముగా గ్రహింపఁ గలుగుదురనియు, నొక శాసనమును వెల్లడించిరి. అది తెలిసి నా సోదరుండును, కృష్ణారాయపురం అగ్రహారం బోర్డు రూరల్ స్కూలు హెడ్మాష్టరున్ను, అర్జున, చి॥ లక్ష్మీనరసింహము ప్రైమరీక్లాసు బాలురకు నిర్ణయింపఁబడిన పుస్తకములలోని విషయములను తెలియఁజేసి తానును విశేష సాహాయ్యమొనర్ప నేను నా సహోదరుండనై బాలురకును బాలికలకును గూడ సుబోధమగునట్లు సులభశైలిని కళాశేఖర చరిత్రమును పెర నాటకంబుల కల్పిత నాటకమును రచించి 'సరస్వతీ ప్రసాదము' అనునట్లు ప్రైమరీక్లాసులోని బాలురు చదువతగిన పిక్చర్సు, హిష్టరీ, జాగ్రఫి, అగ్రికల్చరు, గ్రామరు, సైన్సు, సూర్యకుటుంబము, మొదలగు విషయంబులను ఆయా కథాసందర్భముల ననుసరించి వచ్చునట్లు పాత్రసంవిధాన మొనర్చియుంటిని. ఈ నాటకమును 1910 సం॥ రం ఏప్రెల్ తే 7 దీని విజయనగరములో జరిగిన విశాఖపట్నం జిల్లా ఎలిమెంటరీ స్కూళ్ల మొదటి కాన్ఫరెన్సులో శారదా సమాజమును పేరుగల ప్రైమరీక్లాసులోని బాలురచే ప్రదర్శింపించఁగా ప్రసిడెంటుగారు బహుమాన పతకమును దయచేసిరి. విద్యాశాఖాధికారు లనేకులు సర్టిఫికెట్లను దయచేసిరి. వాని నిందు క్రిందఁ బొందుపఱచినాడను

ఈ నాటకము వీరు వారనక సకల జనోపయోగము నకై రచింపఁబడినది. తెలుగుదేశములోని ప్రతి మానవునకును, స్త్రీ బాలురకును. దీనిని చదువుట అవశ్యకర్తవ్యమని నా యభిప్రాయము.

ఈ గ్రంథమును స్వానుభవముచే గొన్ని విషయంబులును అనేక గ్రంథంబులలోని పెక్కు విషయంబులును, గ్రహించి రచించినాఁడను. దీని ముద్రణంబునకై బ్ర. శ్రీ. టి సదాశివ శాస్త్రులుగారును, చెంగల్పట్టు డి॥మునసబుగారైన మ.రా.రా.శ్రీ. అద్దంకి వెంకటరామయ్య పంతులుగారును, బ్రహ్మశ్రీ. కె ఎన్. కేసరిగారును, ఇంకను చెన్నపురిలోని గౌరవనీయులగు అనేక భాషాభిమానులును, సాయంబొనర్ప నింతలో శ్రీ పిఠాపుర సంస్థానాధీశ్వరులగు శ్రీ వేంకట కుమారమహీపతి సూర్య రావువారు పండిత పారితోషికము క్రింద రు100-0-0 లు ఇచ్చి చేసినందున పూర్తి యైనది. కావున ఆయా గ్రంథకర్తలకు, గ్రంథముద్రణమునకు సాహాయ్య మొనర్చిన వారికిని, కృతజ్ఞుఁడ నగుచున్నాఁడను. ముద్రణాది లోపంబుల మన్నించి రసంబును గ్రహించుటకు సరసమతులగు వివేకులే ప్రమాణము.

ఇట్లు

గ్రంథకర్త

కృష్ణారాయపురం అగ్రహారం.

బొబ్బిలితాలూకా, విశాఖపట్నం జిల్లా

## ఈ నాటకమునందలి కథాసూచన.

విద్యానగరమునకు ప్రభువు గుణసాగరుడు. కళాశేఖరుడు రాజపుత్త్రుడు. సుబుద్ధి మంత్రి పుత్త్రుడు. అనగా సద్గుణములకు యోగ్యతయు, విద్యకు బుద్ధియు, సాహిత్యములని భావము.

I అంకము—ఒకనాడు రాజు కొలువుండగా అచ్చటికి కళాశేఖర సుబుద్ధులు వచ్చిరి. రాజు వారి విద్యాభ్యాసమును ముచ్చటింపగా సుమంతాదులు చేసిన ప్రసంగమున సివిక్సులోని కొంతభాగము ప్రస్తావింపబడును. పిమ్మట రాజపుత్త్రునకు యౌవరాజ్య పట్టాభిషేకమునకై ముహూర్తమునిర్ణయింపబడును.

II అంకము—రాజపుత్త్రమంత్రి పుత్త్రులు దేశాటనము చేయుటకై రహస్యంబుగ తరలుదురు. వారిని వెతికించుటకై రాజు పలువురు బ్రాహ్మణులను పంపును వారు బెజవాడ సత్త్రమువద్ద కలిసి ప్రసంగవశమున తాము చూచిన స్థలములలోని విశేషములను దెలుపుటలో చెన్నరాజధాని భూగోళము ప్రస్తావింపబడును. ఇంతలో వారిచెంతకు భూక్రయ విక్రయదారు లిరువురు వచ్చి సాక్షిసంతకమును గోరుదురు.

అక్కడ సివిక్సు భాగము కొంతవివరింపబడును పిమ్మట ప్రోనోటును దిద్దుబడిచేయుటను ప్రశ్నగ కొంతవచ్చును. పిమ్మట క్రయదారుడును రైతును సంభాషించుటలో వ్యవసాయ విషయములను గురించి విశేషముగా ప్రస్తావింపబడును.

III అంకము— రాజమంత్రులు పుత్త్రులజాడ తెలియ వలయునంకై విచారింతురు. అంత మంత్రి ప్రసంగవశమున ఆర్యుల యొక్కయు, హిందూదేశమును బరిపాలించిన పూర్వపురాజుల

యొక్కయు, ప్రస్తుతపు బ్రిటిషు ప్రభువులయొక్కయు, చరిత్రమును ప్రస్తావించును.

IV అంకము — చెన్నపురిలోని విద్యావతీ ఆఫీసులో దొరస్వామయ్య గారును, లక్ష్మీనారాయణ శాస్త్రిగారును, సంభాషించుచుండగా సుబుద్ధివచ్చును. పరస్పర కుశలములు తెలిసికొనిన పిమ్మట వారి ప్రసంగములో ఆరోగ్యశాస్త్రము విపులముగ ముచ్చటింపబడును.

V అంకము — స్కూలుమాస్టరు ప్రైమరీతరగతి పిల్లలకు సూర్యకుటుంబమును గురించి బోధించుటలో గ్రహముల పరస్పరసంబంధము, గ్రహణములు, తోకచుక్కలు మొదలగునవి విపులముగ ముచ్చటింపబడును. పిమ్మట సబ్ అసిష్టాంటు ఇన్‌స్పెక్టరాఫ్‌స్కూల్సు వారు బడి పరీక్షచేసి బాలురకు విద్యయందెట్లు అభిలాషకలుగునో దానిని ఒ

VI అంకము — కళాశేఖరుడును, కళావతియు ప్రసంగించుటలో స్త్రీవిద్యను గురించియు, దానివలని మేలును గురించియు, వివాహాదులను గురించియు, భార్యాభర్తలకుండగల పరస్పర సంబంధములను గురించియు, వివిధదేశపు స్త్రీల సౌందర్యమును గురించియు, ముచ్చటింపబడును. పిమ్మట రాజపుత్రుడు జనకునియాజ్ఞపైకొలువునకు వచ్చును. అక్కడమంత్రి ప్రభృతులు ప్రసంగించుటలో సివిక్సును, రాజనీతి సారమున్ను, ప్రస్తావింపబడును. అంతలో రాజపురోహితులు సుముహూర్త సమయమును తెలుప గుణసాగరుడు కళాశేఖరునకు విద్యానగర యౌవరాజ్య పట్టాభిషేక మొనర్చును.



ఈ నాటకమునందు వచ్చు పాత్రములు.

పురుషులు.

1. గుణసాగరుఁడు. I ,అం, III, అం, VI ,అం, ......విద్యా
 ...ధిపతి.

2. సుమంతుఁడు. I అం, III అం, VI అం, ...... గుణ
 సాగరుని మంత్రి

3. కళాశేఖరుఁడు. I అం, VI అం, కథానాయకుఁడు. గుణ
 సాగరునిపుత్త్రుఁడు.

4. సుబుద్ధి. I అం, IV అం, VI అం, ... మంత్రి పుత్త్రుఁడు,

5. రామశాస్త్రి. VI అం.
6. వేంకటసోమయాజులు.
7. గోపాలచయనులు.
8. జగన్నాథసిద్ధాంతి.Iఅం.
9. శంకరభట్టు.
10. పేరిదీక్షితులు.

(5–10) II అం, రాజపుత్త్రిమంత్రిపుత్త్రి లను వెతుకుటకు పోయిన బ్రాహ్మణులు

11. శ్రీరాములు. విష్కంభము...... రాజపురోహితుఁడు.

12. శంకరావధానులు. డిటో- వైదికి బ్రాహ్మణుఁడు.

13. నారాయణ... ... ... ... భూక్రయదారుఁడు.

14. జోగన్న... ... ... ...విక్రయదారుఁడు.

15. సూత్రధారుఁడు....నాటకమును నడుపు నటుడు.

16. లక్ష్మీనారాయణశాస్త్రి. IV దొరసామయ్యమిత్రుఁడు.

17. దొరసామయ్య IV అం, విద్యావతీ యెడిటరు.

18. ఇన్‌స్పెక్టరు. V అం.

19. మాస్టరు. V అం.

20. బంట్రోతు. V అం.

21. రైవతకుఁడు. I అం. దావారికుఁడు.

22. జాంగలుఁడు. I అం. భటుఁడు.

23. చిత్రకుఁడు. III అం. దావారికుఁడు.

24. సాహుకారు. IV అం. వర్తకుఁడు.

25. సుబ్బయ్య. IV అం. వర్తకుని కొడుకు.

26. భద్రకుఁడు. VI అం. కంచుకి.

27. పారిపార్శ్వకుఁడు. ...... ప్రస్తావనలో నటుఁడు.

28. కొందఱుబ్రాహ్మణులు. } IVఅం.కథాసందర్భమునవత్తురు
29. కొందఱుబడిపిల్లలు. }

—స్త్రీలు.—

30. కళావతి. VI అం. కథానాయిక.

# ప్రకటన.

## ప్రవకధాసుధారసము.

ఇది శ్రీ మహాకవి కాళిదాసవిరచితమగుకుమారసంభవ కథననుసరించి బ్రహ్మశ్రీ ఆర్యసోమయాజుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారిచే నెనిమిది యాశ్వాసములుగా రచియింపఁ బడిన మహాప్రబంధము. అక్కడక్కడ మహాకవి భావముల ననుసరించినను మొత్తముమీఁద గ్రంథమంతయు స్వకపోలకల్పితమై లక్షణోక్తంబగు ద్వావింశద్వర్ణనంబులచేఁ జెలువారుచున్నయది. ఇందలి పదౌచిత్యంబును, శయ్యాలాలిత్యంబును, భావగాంభీర్యంబును, పాకసౌష్ఠవంబును, బరిశీలించి యభిప్రాయంబు లొసంగిన మహాకవుల గొందఱనుదహరించుటచే నెల్లరకు విశదంబగునని యుల్లేఖచేయుచున్నాఁడను.

1. కావ్యకంఠ బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ అ.గణపతిశాస్త్రిగారు,

నటేశ్వరజటాతట భ్రమదదభ్ర వేగోచ్చల త్సుపర్వతటినీఝరీ ఝులిత ధారతీడంబరః । శిరశ్శివణాధారిణాం ప్రతిపదాంబలాచ్ఛాలయ న్నయం కవికులాచలోభువివిభాతి నారాయణః॥

బాలసరస్వతీ బిరుదాంకితులును ఆత్మకూరు సంస్థానాస్థాన విద్వాంసులును అగు శ్రీమాన్, తిరుమలబుక్కపట్టణపు

దాఁక మాపట్టికి తనువుగందు, హంసతూలికల యందైనను
నడువమాపిల్లియడుగులు జిల్లులువడు॥ నెన్ని నోములునో
చిరెయో కన్నవార, మయ్యో మాకన్నతల్లిపై నెయ్యమించు,
కేనియుందిరి లేదు చికిచ్చినార, మెట్టుతేలెవో నిటమీఁద
**నెలమిదండ్రి॥**

ఉ॥ అంత వసంతమొప్పె మలయానిలకంపిత పాంథకామిని
స్వాంతము పుష్పసంఘవిలసన్ మధుపాళి విరావపూరితా
శాంతము మంజుకుంజచర దాత్తపికాసుగతాబలారతా
నంతసుఖానుభూతిఁ బరిహాసిత ఘోర లతాంతకుంతమై

సీ॥ ఆదిభిక్షుఁడు విరూపాక్షుఁ డెద్దాన నిమ్మహితలంబున రాజ
మౌళియగుట, బలియాచనావృత్తిఁ బఱగు యుపేంద్రుఁ
డెద్దానిచే శ్రీపతిత్వంబుఁ గనుట, మునిశాపసంహతి
నిర్ధనుఁ డింద్రుఁ డెద్దాన నరయ బునర్విభవాఢ్యుఁడగుట,
కూఁకిపదింగ సురకోటు లెద్దానిచే బాలుష్పానసమృతాన్న
భోజులగుట॥ మఱియు నెద్దాన జీమూతమండలంబు,
తన రజగమున జీవనదాయి యగుటఁ, గలిగ పిలపిల్లె
నట్టి పెన్గడలి మహిత, తీరముచు చాలాదను జేయుట
యన॥

ఉ॥ అంతనుకై కెడిన్ మథను దభ్రముపక్కలు గాఁగనార్చుచున్
గుంతముఁ గేలఁదాలిచి ముకుందునిపై నడరంగనా రమా
కాంతుఁడు పిన్ననవ్వొలయఁ గాలునిపీటికి వాని నంపె దు
ర్దాంతతనొత్తె సంక్షుభితదానవసైన్యముఁ బాంచజన్యమున్॥

క॥ యువజనధైర్య తనుత్రాణవిభేద కళాప్రవీణసక్రధ్వజ చా
పవిముక్తబాణధారానివహాంబీసుందరీమణీవీక్షణముల్.

ఈగ్రంథ మిరువదిపౌనుల డెమి కాగితములపైని చ
క్కని పెద్ద యక్షరములుగా ముద్రింపఁబడినది. 35 ఫారము
లు, దివ్యమైన సరళి, మంచి బైండు, క్రయము పోస్టేజికాక
1రూపాయి మాత్రమే, నూటికి 10 వంతున కమీషనుసంపాదన బడు
ను. దీనిని యూనివర్సిటీవారు ఇంటర్మీడియట్ క్లాసునకుఁ బఠ
నీయగ్రంథముగా నియమించిరి ఇట్టి రసోత్తర ప్రబంధమును
ఆంధ్రజాతీయుఁడగు ప్రతిమానవుఁడును బఠించి యానందింపవ
లయునని మాతాత్పర్యము. మంచితరుణము, మీమీ మిత్రు
లకుగూడఁ బ్రోత్సాహము గావింపుడు. ఈగ్రంథము వలయు
వారు యీ దిగువ అడ్రసుకు వ్రాయవలయును.

"కేసరికుటీరము.
ఆయుర్వేద ఔషధశాల అందరుపేట.

మద్రాసు.



# నాంది.



ఓం కారవాచ్యునకు హరి
ణాంకకళా శేఖరునకు నగజేశునకున్ ।
శంకరునకు నిజభక్తవ
శంకరునకు మ్రొక్కెదన్ ప్రసన్నుండగుటకున్ ॥

ఈపద్యమున నాయక నామసూచనకలదు గావున దీనిని నాందీగా పఠించుటయుక్తము తక్కిన చిఱుతుకలోపంబులను పాఠకులు సులభముగా సవరించుకొనవచ్చును. ఈ గ్రంథ ముద్రణ విషయమై విశేష వ్యయప్రయాసముల కోర్చిన నా మిత్రులగు బ్ర. శ్రీ పోలంపల్లి కామయ్యగారికిని, బ్ర శ్రీ. చెన్నాప్రగడ భానుమూర్తి పంతులుగారికిని, కృతజ్ఞతా పూర్వకవందనము లాచరించుచున్నాఁడను

ఇట్లు
గ్రంథకర్త

# OPINIONS.

---

*Kalasekhara Charitram* a Telugu drama by Brahma Sri Aryasomayajula Lakshminarayana Sastri Garu, a present telugu poet of rare merits, is a unique work of its kind. The poet has, with a complete grasp of the whole field to be covered by the student of an Elementary School before he leaves it, managed to compress it into a small volume in a most masterly and fascinating way and a style at once simple and elegant. The whole thing is so charming that the juvenile reader is caught into the current and carried headlong with it, without suspecting how far he has travelled. It is, in short, an Encyclopædia of elementary instruction compressed into a very small space with very great artistic and educative effect, and is a boon to school-going children, who without such a valuable aid, would be left to master a large amount of dry detail.

TRIPLICANE, MADRAS, 24th Feb. 1910. } C. BHANUMURTI, B.A., L.T., *Munshi to Telugu Translator to Govt., Formerly Lecturer, Noble College, Masulipatam.*

---

I have gone throngh *Kalasekhara Charitram* a novel drama, in the Telugu language, written by Brahma Sri Aryasomayajula Lakshminarayana Sastri Garu of Krishnarayapuram Agraharam in the Vizagapatam District. It need not be said that the poet is of rare abilities. The descriptions are vivid. The diction is pure and simple and intelligible even to females. The peculiarity about the drama is that it covers the whole ground of the Elementary School currriculum. He has really done immense good to an Elementary School Master who has to work on the modern lines It is earnestly hoped that be will he encouraged to do further service to the department by his work being patronized by the teachers as well as the Inspecting Officers.

RAJAHMUNDRY, 12th June, 1910. } P. APPALANARASAYYA, *Ag. Assistant Inspector of Schools, Godavari District.*

This is to certify that I witnessed the dramatic performance given by the boys of the Elementary School of the village of Krishnarayapuram Agraharam..........on the eve of the first Elementary Teacher's Conference held on the 7th April 1910, at Vizianagaram and that it was worth seeing. I am told that the scenes enacted by the boys were taken from one *Kalasekhara Charitram* composed by. one Mr. Aryasomayajula Lakshminarayana Sastri.

K. RAMANUJA CHARI, M.A., B.L., F. M. U.,

*Principal, H. H. The Maharajah's College,*

*22nd May, 1910.* *Vizianagaram.*

*Kalasekhara Charitram* is an excellent production of the authors, which I have seen put on the stage on more than one occasion. It is unique, in as much as it treats of almost all the subjects embraced in the present-day curriculum of studies of an Elementary School. The plot is so admirably developed as to contain all the information required to be possessed by one who leaves an Elementary School. The authors have aimed at combining instruction with pleasure, which object has been, in my opinion, successfully achieved. Certain suggestions made by me with regard to Physical Geography as well have been promised to be incorporated, which, I believe, will find a place in the book, when it sees the light of day. In short, the work is, in my humble opinion, a boon to the Elementary School which will have to be deeply indebted to the author, Brahma Sri Aryasomayajula Lakshminarayana Sastri Garu and Aryasomayajula Lakshminarasimham Garu of Krishnarayapuram Agraharam, Bobbili Taluq.

PARVATIPUR,
*12th August, 1910.* V. NARAYANA MOORTHI, B.A., L.T.,

*Sub-Assistant Inspector of Schools,*

*Parvatipur Range.*

*Kalasekhara Charitram* a small nice drama in Telugu, composed by the poet Brahma Sri Aryasomayajula Lakshminarayana Sastri Garu of Krishnarayapuram Agraharam, in Parvatipur Range, Vizagapatam District, was excellently played by the children of Krishnarayapuram Board School and was very much appreciated by the audience at the first Vizagapatam District Conference and Exhibition held at Vizianagaram, on the 7th and 8th April, 1910. The drama is composed in simple chaste Telegu and has an educational and elevating influence. It deals with a number of things which every child in the higher standards of Elementary Schools ought to know. The acting by the children was excellent.

VIZIANAGARAM,
*27th July, 1910.*

K. SUDARSANA ROW,

*Secretary, Vizag. District Conference Committee.*
and
*Sub-Assistant Inspector of Schools,*
*Vizianagaram Range.*

---

I have heard portions of the Telugu book *Kalasekhara Charitram* by Aryasomayajula Lakshminarayana Sastrulu Garu, readout to me. The book is written in simple,—sometimes colloquial Telugu—and teaches many things which should be learnt by children. I wish it a large sale.

MADRAS,
*24—3—11.*

J. RAMIYA,
*Presidency Magistrate,*
*Egmore, MADRAS.*



శ్రీ

# —కళాశేఖరచరిత్రము.



## నాంది.






కారవాచ్యునకు సిత
పంకరుహాత్మాదివిబుధ పరిసేవ్యునకున్
శంకరునకుఁ జంద్రకళా
లంకారున కిడుదు మ్రొక్కులన్ భక్తిమెయిన్॥

గీ॥ కవివరేణ్యులపాలిటి కల్పవల్లి
యమృతకర కళాధారిణి యజునిరాణి
సకలవిద్యాస్వరూపిణి శారదాంబ
మంజులేక్షణముల మిమ్ముమనుచుగాత॥

నాంద్యంతమున-(సూ- తెరవంకఁ జూచి) మారిష! ఇటురమ్ము!
పారిపార్శ్వకుఁడు-(ప్రవేశించి) ఇదిగోసిద్ధముగానుంటిని, ఆర్య!
ఏమియాజ్ఞ?

సూత్ర - ఆజ్ఞాపింపఁబడితిని సభాసదులచేత, ఇట్టి శరత్సమయమున పార్వతీపురం రేంజిలో చేరిన కృష్ణారాయపురం అగ్రహారం బోర్డు రూరల్ స్కూలు హెడ్మాష్టరుగారగు శ్రీమద్వార్యసోమయాజుల లక్ష్మీనరసింహముగారిచే నూతనముగా రచింపఁబడిన కళాశేఖర చరిత్ర నాటకమును ప్రదర్శింపవలసినది.

పారి —(ఆశ్చర్యముతో) ఆర్యా; ప్రాచీన మహాకవుల ప్రసిద్ధనాటకములనేకములుండఁగా ఒక స్కూలుమాష్టరుచే రచింపఁబడిన క్రొత్తదానివిషయమై ఏమిట్లు పలుకుచున్నారు?

సూత్ర - అట్లుకాదు. ఒకరిని అనుసరించి పలుకుట మూఢుల త్రోవ, భావము రసము ఔచిత్యము మొదలగు గుణాములగ్రహించుట విద్వాంసుల మార్గము.

పారి - అట్లైన సభాసదులే ప్రమాణము ఆర్యా! ఎట్లీగ్రంథకర్తగారికి ఇట్టి రచనాకౌశలము పట్టువడినది?

సూత్ర - ఎట్లా? గ్రంథకర్తగారికి అగ్రజులును శివశిక్షా సుధారసప్రబంధ కర్తలును, లక్షణాద్యనేక నాటక రచనానిపుణులును, ఐన బ్రహ్మశ్రీ, లక్ష్మీనారాయణశాస్త్రిగారి సాహాయ్యంబువలన.

పారి- ఓహో! అట్లైన సందేహమేలేదు. ఆర్యా! ఇంక నేమియాజ్ఞ?

సూత్ర - మారిష! మనది "శారదాసమాజ" మగుటచేతను, మనము చేయఁబోవునది విద్యావిషయమగుటచేతను, గాన నైపుణ్యము మెఱయ లోకమాత యగు శారదను ప్రార్థింతము.

పారి - చిత్తము. ఆర్యునాజ్ఞ (అని ప్రాంజలులై ఇరువురు.)

(పాట) కలిగులాపహే పాహిశారదే।

కచకలాపభా విజితనీరదే ॥౧॥

చంద్రభూషణే చతురభాషణే।

సదయవీక్షణే సంతతక్షణే ॥౨॥

రమశివేధసో జననిజన్మినాం।

భగినిధూర్జటే రవనియోగినామ్॥ ౩॥

(తెరలో) ఓయి సూత్రధారుఁడా! దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము. నీకోరిక నెఱవేరునుగాక.

సూత్ర -(ఆశ్చర్యముతో)ఆహాహా!అమృతమువర్షించినట్లున్నది, మారిష! నామసామ్యముచేత మన సమాజముపట్ల, భగవతి శారదాదేవి దయఁగలిగి వరంబు ప్రసాదించుటచే ధన్యులమైతిమి. ప్రకృతము ననుసరింపవలెను. పాత్రములు సిద్ధముగా నుండవచ్చును.(తెరవంక చెవి యొగ్గి విని) అదె, విద్యానగరాధీశ్వరులగు గుణసాగర మహారాజుగారు సభకు వేంచేయుచున్నట్లున్నది. ఇఁక రా! పోదము.

పారి - చిత్తము.(ఇద్దరు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

## ప్రథమాంకము.

స్థలము గుణసాగర మహారాజుగారి సభాభవనము.

(అంత గుణసాగర మహారాజును, మంత్రి సుమంతుఁడును, రాజసుతుఁడు కళాశేఖరుఁడును, మంత్రిసుతుఁడగు సుబుద్ధియును- యథావిభవముపరివారమును, ఆసనముల నుపవిష్టులై ప్రవేశించుచున్నారు.)

గుణ - సుమంత! ఆయుష్మంతులు విద్యలన్నిటిని నేర్చి కాలేజీని విడచి సానలుపట్టిన మంచిరత్నములవలె చూచుటకు సంతోషమును గలుగఁజేయుచున్నారు!

సుమ - మహారాజ! సందేహమేమి? రత్నాలగనిలో గాదా పుట్టినా? విద్యవలని ప్రయోజనమును చెప్పుట కెవ్వరి తరము?

గీ॥ విద్యయొసఁగును వినయంబు వినయమునను
బడయుఁబాత్రతఁ బాత్రతవలన ధనము
ధనమువలనను ధర్మంబు దానివలన
నైహికాముష్మిక సుఖంబులందు నరుఁడు॥

అని చెప్పఁబడియున్నది. ప్రతిమనుష్యుఁడును విద్యను నేర్చియే తీరవలెను. విద్య తక్కువగుటచేత నేకదా మనదేశము ఇట్టి బీదస్థితికి వచ్చినది? గణితము, వ్యవసా.

యశాస్త్రము, మొదలగు విద్యలు నేర్చినచో తగిన యంత్రసాహాయ్యములవలన వ్యవసాయము అధికమై విశేషముగ పండుటచే మనదేశమున కరువు అనుమాట కలుగునా? ఆరోగ్యమార్గములు తెలిసికొన్నచో కలరా, ప్లేగు, మసూచి, మొదలగు రోగములు ఈదేశమున నడుగుఁబెట్టి ఇంత విజృంభించఁగలవా? మఱియొకటి, చదువుకోనివారనేకులు రాబోవు కాలమునుగూర్చి ఆలోచింపక పెండ్లిండ్లయందును, ఇతర కార్యములందును, అధికముగా ఖర్చుచేసి అప్పులలో మునింగి కుటుంబములను బీదస్థితికిఁ దెచ్చుచున్నారు. ఒకరినిఁజూచి మఱియొకరు తామును అంతటివారమే అనుకొని లేనిపోని డంబములకుఁబోయి అడుగంటిపోవుచున్నారు. మహారాజ! విద్యయేయున్న ఇట్టి తెలివితక్కువపనులు మనదేశమున కలుగకుండును గదా?

గుణ - సందేహమేమి? ఈవిద్య ఎన్ని విధములు?

సుబు - మహారాజ! విద్య మూడువిధములు. (1) ప్రైమరీ, అనఁగా ప్రారంభవిద్య. (2) సెకెండరీ, అనఁగా హెచ్చువిద్య; ఇందు భిన్నగణితము, బీజగణితము, క్షేత్రగణితము, భౌతికశాస్త్రము, మొదలగునవి చేరియుండును (3) శాస్త్రకళాశాలా సంబంధమగు అధికవిద్య, బీదసాదలు కావలసిన సొమ్ము తమకు లేనందున కొద్ది

విద్యయగు ప్రైమరీకన్న అధికమున చదువలేరు. మొగలాయి చక్రవర్తుల కాలములోనేమి, అంతకుముందున్న రాజుల కాలములో నేమి, అట్టివారలు చదువు కొనుటకు వసతులే లేకుండెడివి. పశ్చిమోత్తర పరగణాలను పాలించుచుండిన లెఫ్టినెంటు గవర్నరుగారైన "జేమ్సు తామ్సన్" దొరగారు 1835 వ సం॥లో హిందూదేశమందు పల్లెటూళ్ల బడులను మొట్టమొదట స్థాపించిరి. పిమ్మట 1856 వ సం॥ లో ప్రైమరీ విద్య చెప్పించుట తమ డ్యూటీ యని గవర్నమెంటువారు వెల్లడిచేసి తాము ఆపనికి బూనికొనిరి. 1858 వ సం॥ లో ఈదేశమందుండిన పాఠశాలలు ఇరవై వేలు. అందు చదువుచుండెడు పిల్లలు రెండులక్షలు.

గుణ - ఇప్పుడో?

సుబు - మహారాజ! హిందూస్థానమున సుమారు ముప్పదికోట్ల జనులు కలరు. అందులో హిందువులు ఇరవై కోట్ల ముప్పది రెండులక్షలు. అందు పురుషులు సుమారు పదికోట్ల పంద్రెండులక్షలు. వారిలో చదువురానివారు తొమ్మిది కోట్ల యేబదిలక్షలు, ఇక సుమారు పదికోట్ల యిరువై లక్షల హిందూస్త్రీలలో చదువుకొన్నవారు పది లక్షలు. నానావిధ మతస్థులు సూమారు పదికోట్లు. అందులో చదువురానివారు మిక్కిలి అధికము.

గుణ - ఆహా! మనదేశములో విద్య యెంత తక్కువస్థితిలో నున్నది?

సుమ - మహారాజ! ఇప్పటి బాలురే రాబోవు పౌరులని తలచి తమబిడ్డలకు చదువుచెప్పింపవలయునను శ్రద్ధతల్లిదండ్రులకుండవలెను లేనియెడల విద్య వీరికచ్చియున్నదా?

గుణ - ఔను, తమపిల్లలకు విద్యచెప్పింపని తల్లిదండ్రులు శిక్షింపఁబడుదురని గవర్నమెంటువారు చట్టము నేర్పరచినచో ఈదేశము విద్యామయమై అభివృద్ధికి వచ్చును గదా?

కళా - శాంతమును, ఎల్లప్పుడు కృషిచేయుటయందు పట్టుదలయును, గల విద్యానిధులగుటచేతనే గవర్నమెంటువారు చక్రవర్తులై ప్రజాపరిపాలనము చేయుటకు తగియున్నారు.

గుణ - ఆయుష్మంత! అదెట్లు?

కళా - రాజ్యపరిపాలనమునకు వార్త ముఖ్యము.

శ్రీ మహాభారతములో॥ఆ।వె॥ వార్తయందు జగము వర్తిల్లుచున్నది, యదియు లేనినాడ యఖిలజనులు, నంధకారమగ్నులగుదురు గావున, వార్త నిర్వహింపవలయుఁ బతికి.

అని చెప్పఁబడియున్నది. దానిని జరుపుటకు ఇప్పుడు పోస్టల్ డిపార్టుమెంటు కల్పింపఁబడినది. అతిజరుగురై

నప్పుడు టెలిగ్రామ్ ఆఫీసులు యేర్పడియున్నవి. పూర్వము వార్త తెలియుటకు ఎంతో కష్టపడవలసియుండెడిది, ఒకయూరి సమాచారము మఱియొకయూరికి తెలియుట కష్టము, ఇప్పుడో ఇండియాదేశములో నే భాగమునకైనను మూడుపైసల ఖర్చుమీఁద అన్ని సమాచారములు వేగముగా పంపవచ్చును. ఒకవేళ జాబు చిరునామాదారునకు అందనిచో రిపోర్టుచేసిన యెడల అధికార్లు విచారణచేసి నౌకర్లను శిక్షింతురు. ముఖ్యమైన జాబులు అందవను అనుమానము కలిగిన ప్పుడు మూడణాలు ఖర్చుచేసి రిజష్టరు చేయించినచో ఆజాబును చేర్చి చిరునామాదారునివలన అందినట్లు రసీదును పంపినవారికిత్తురు; క్రొత్తపద్ధతుల ప్రకారము బేరింగు జాబును వేసినయెడల అది నిష్ఫలము. ఇదిగాక పార్సిల్ డిపార్టుమెంటు కలదు. దీనిద్వారా ఏవస్తువునైనను ఎచ్చటికైనా పంపవచ్చును ఇదియు రిజష్టరు కాబడవచ్చును. నవరలు, నోట్లు, నగలు మొదలగు వస్తువులనుగూడ అతిజాగ్రతగఁ బంపుటకు ఇన్ష్యూరెన్సు పద్ధతికలదు. మనియార్డరు ద్వారా ఎంతసొమ్మైనను, ఎంతదూరమునకైనను, భయములేకుండ పంపవచ్చును. రివిన్యూ మనియార్డరునకుమాత్రము పోష్టురుసుము లేదు-

సుబు- రివిన్యూ మనియార్డరనఁగా?

కళా- నేలఖామందు తా నితరస్థలంబుల నున్నప్పుడు తాను చెల్లించవలసిన సిస్తుపైకమును గ్రామమునసబునకుఁ గానితహాశీల్ దారునకుఁ గాని పంపునది - మఱియు సేవింగ్సుబ్యాంకు కూడ తపాలాఫీసులలో చేర్పఁబడియున్నది. కష్టసుఖములకుగాను కూడ బెట్టుకొన్న సొమ్ము ఇంటదాచినప్పుడు దొంగలపాలుగాని, మఱియొకవిధముగాగాని,ఖర్చగును. అప్పిచ్చినయెడల "అప్పు ఆకటికిరాదు"అనునట్లు సమయమునకు వచ్చుట దుర్లభము. కనుక సేవింగ్సుబ్యాంకులోదాచికొనుట చాలమంచిది. ఇఁక తంతివార్తవిషయము;ఒకరికొక రెంతదూరమందున్నను, వెంటనే కొద్దిసొమ్ముతో వార్త తెలియపఱచుకొనవచ్చును. పూర్వము ఇట్టి సదుపాయములుండెనను మాటయైనను విన లేదుగదా ?

సుబ్బు — ఆహా కళాశేఖర ప్రభువుగారు శలవిచ్చిన విషయములు ఎంత పొగడఁదగియున్నవి? గవర్నమెంటువారుచేయు లోకోపకారములను చెప్పుట కెవ్వరితరము? పూర్వము ఏకాలంబున నెవ్వరెఱుంగని పోలీసుడిపార్టుమెంటును ఏర్పఱచి దేశమునకు ఎంతనెమ్మదిఁ గలిగించిరో తెలియనివారెవ్వరు?

గుణ - ఏదీదానిని విన సంతోషము కలుగుచున్నది?

సుబ్బు -సర్వజ్ఞుల యెదుటనా నాబోటివారలు ఇట్టివి మనవిచే

యుట? అయినను మహారాజు నాజ్ఞ!-ఈ పోలీసు డిపా
ర్టుమెంటు రెండువిధములు.

గుణ - అవియేవి?

సుబు - మిల్టరీ, సివీల్ అని; అందు మొదటిదానికి రిజర్వు అని
పాడుక. అది యుద్ధముచేయుసైన్యము. రెండవది ప్రస్తు
తము మనదేశమందంతటను కొట్లు తిట్లు దొంగతన
ములు మొదలగు నేరములు జరుగకుండ నాటంకపఱ
చుటకును, అట్లుచేసిన దుర్మార్గులను పట్టుకొని మేజ
స్ట్రేట్టుగారి యెదుటఁబెట్టి శిక్షింపించుటకును ఏర్పడినది.

గుణ - దేశములో జనులవల్ల కలుగు అల్లర్లు, దొంగతనములు
బందిపోట్లు, హత్యలు, మొదలగు నేరములు జరుగకుం
డుటకును అందఱు చట్టములకు విధేయులై నడచుకొ
నునట్లు చేయుటకును, శత్రువులవలని బాధలు తొల
గించుటకును సైన్యములు కలవే? మఱియు దీనికొఱ
డిపార్టుమెంటేల?

సుబు - మహారాజ! సైన్యము నిర్ణయింపఁబడిన ముఖ్యమైనచో
ట్లనే యుండును. ఇది అట్లుకాదు. సాధారణముగా దేశ
మందు అంతటను పోలీసువార్లు నియమింపఁబడి యుం
డినను సైన్యమువలె ఒకచో గుంపుగానుండక వేరువేరు
గా పట్టణములందును పల్లెలందును గ్రామములందును
తిరుగుచుందురు.

గుణ-వీరియొద్ద ఆయుధములుండునా?

సుబ - (తనలో) ఈమహారాజుగారు మమ్ములను పరీక్షించుటకై కాఁబోలును ఏమియు నెఱుఁగనివానివలె ఇట్లు ప్రశ్నలువేయుచున్నారు? అగుఁగాక. (ప్రకాశము) మహారాజ! పొట్టిలాటీకఱ్ఱమాత్రము ఉండును. అవసరము వచ్చినప్పుడు కత్తి తుపాకి పేరునకుమాత్రము పట్టుకొందురు. వీరుసాధారణజనులనుండియే యేర్పఱుపఁబడి కొద్దిరోజులు కవాతు తుపాకి కాల్చుట మొదలగునవి నేర్చికొనిన పిమ్మట అధికారులచేబయటకుఁ బంపఁబడుదురు.

గుణ - ఏదీ వీరిచరిత్రము పూర్తిగా వినుటకు ఉత్సాహమగుచున్నది.

సుబ - చిత్తము, మహారాజునాజ్ఞ; బ్రిటిషు గవర్నమెంటునకుఁ బూర్వము ఇట్టి పోలీసుతురుపు లేదు. సైన్యమే యీపనిని చూచుకొనుచున్నందునపరగణాల గవర్నర్లు సేనాధిపతులగనుండిరి. అందుచే దేశములో మూలమూలల ప్రతిగ్రామమునకును నెమ్మదికలుగకుండెను. బ్రిటిషువారును కొంతకాలము అట్లే చేయుచుండిరి కాని సైన్యమునకు ఖర్చు మెండనియు సైన్యము ఎప్పుడును రక్తమును చిందించుచుండుటచేత చూచువారికి భయంకరంబుగ నుండుననియు ఇట్టి సివిల్ పోలీసును ఏర్పఱచిరి.

ఇప్పుడుకొన్ని గ్రామములకుఒక పోలీసుష్టేషనువంతున ఏర్పఱచి దానికిష్టేషనాఫీసరును నియమించి ఆతనిక్రింద పదిమందికి తక్కువకాని జవానులను నియమించిరి. వారు ఆష్టేషనులోచేరిన గ్రామములకు అన్నిటికి తమతమ బీట్లప్రకారముప్రతిదినము గస్తితిరుగుచు ఆయాగ్రామములలో జరుగు కొట్లు,తిట్లు, ఘాతలు, మొదలగు నేరములను బట్టుచు, మేజస్ట్రేటుగారి యొద్దకుఁ దెచ్చి హాజరుపెట్టుచు, నేరములు జరుగకుండ ఆటంక పఱచుచుందురు.

సుమ - ఈష్టేషనులను తనిఖీచేయుట కలదా?

సుబు - (తనలో)నాయనగారును మహారాజుగారిపద్ధతినే అవలంబించిఅడుగుచున్నారు, అగుగాక. (ప్రకాశము) ఆహా,కలదు.

సుమ - ఎవరు?

సుబు - తాలూకాపట్నమున హెడ్ క్వార్టరులోనుండుపోలీసు ఇన్స్పెక్టరుగారు.

గుణ - గొప్పగొప్ప నేరములను మేజస్ట్రేటుగారి యొద్దకు తీసికొనిపోవుటకుముందు విచారణచేసి నిజమైన నేరస్థులను కనుగొనుపని ఈ యిన్స్పెక్టరుగారికి కలదా?

సుబు - కలదు

సుమ - గ్రామమున్సబు తాను విచారింపకను పై వారికిఁ దెలి

యుఁజేయకను నేరములను అణచివేసిన న్యాయమునకు
వీలుండదే, అప్పుడో?

సుబు - పోలీసువారు అతనిమీఁద రిపోర్టుచేయుదురు. కనుక నే
అట్టిఆటలు సాగవు.

సుమ - జిల్లాకు ఎందఱు ఇన్‌స్పెక్టర్లుందురు?

సుబు - ఒక జిల్లాలో కొన్ని తాలూకాలుండును, వానికొక్కొ-
క్కరుగా కొందఱు పోలీసు ఇన్‌స్పెక్టర్లుందురు. ఇట్టి
వారిమీఁదను, డిపార్టుమెంటు సిబ్బందిమీఁదను, జిల్లా
కొక అధికారికలఁడు. ఆయనకు పోలీసు సూపరెంటెన్
డెంటు అనిపేరు. వీరు జిల్లానంతయు తనిఖీచేయుచు,
బందిపోట్లు మొదలగు గొప్పనేరములు జరిగినప్పుడుతా
నాస్థలమునకువెళ్లి విచారణ చేయుచుందురు.

గుణ - వారిపై అధికారులు కలరా?

సుబు - కలరు. ఆయనకు డిప్యూటి ఇన్‌స్పెక్టర్‌జనరల్‌. అని
పేరు- ఆయనమీఁద ఇన్‌స్పెక్టర్ జనరల్‌గారు-వారినే
ఐ-జీ అందురు.

గుణ - వా రెక్కడనుందురు?

సుబు - వారు రాజధానీస్థలములోనుండి డిప్యూటి ఇన్‌స్పెక్ట
ర్ జనరల గారి సాహాయ్యముతో రాజధానీ నంతయు
విచారించుచుందురు.

గుణ - ఇఁక రిజర్వుసంగతిఏమి?

సుబు - మహారాజ; ప్రతిజిల్లాలోనురిజర్వుపోలీసుసిబ్బందికొంత యుండి అకస్మాత్తుగాకలుగు తొందర్లకు సాయపడుచుండు ను. కనుక దేశమంతయు నిండియుండు సిబ్బందికి యేర్పాటు లేక న్నెమ్మదికలిగి దేశముసుఖస్థితియందున్నది. ఇప్పుడు సం॥కు సుమారు నాలుగుకోట్ల రూపాయీల కధికముగా ఖర్చు చేయుచు పోలీసు డిపార్టుమెంటును ఈదేశ క్షేమముకొఱకు గవర్నమెంటువారుంచిరి.

సుమ - ఎన్నిమంచియేర్పాటులున్నను దుర్మార్గులుండిన తొందరలు కలుగుచునే యుండును. లంచములు, తప్పుసాక్ష్యములు, మొదలగు పాక్షికబుద్ధులు మాని, ఒకరియందొకరు ప్రేమగలవారై కార్యములందు వర్తించుచుండిన నేరములే జరుగక కృతయుగధర్మము కలిగియుండునుగదా?

గుణ - సందేహమేమి?

సుమ - గవర్నమెంటువారు వర్తకముచేసికొనుటకు నాటకను గాని, సెటకుగానివిన్నెన్ని సదుపాయములను గలిగించి ప్రజలనువెంత అభివృద్ధికి దెచ్చిరో యెఱుంగరా?

గుణ - అట్లు లేనిచో 1840 సం॥న ఈదేశము ఇతరదేశములతోఁ జేయు ముప్పదికోట్ల రూపాయీల సముద్రవర్తకమిప్పటికి 280. కోట్లుగా ఎట్లు వ్యాపించును.

సుమ - మహారాజ! హిందూదేశములో మనుష్యుఁడుజవించు

టకు కావలసిన వస్తువులన్నియును పుట్టుచున్నవి. అయినను ఈదేశస్థులు ఒకరినొకరు నమ్మకుండుటచేతను, తగిన చదువులేకుండుటవలనను, తక్కువఖర్చునకు అధిక ఫలము దొఱకునట్లు యంత్రములు నిర్మించుకొను శక్తిలేదు. విద్యానిధులగు ఇతరదేశీయులు యంత్రసాహాయ్యమువలనఎట్టిలాభములనుపొందుచుండిరో తెలియనివారెవ్వరు? పూర్వము ఈదేశములో బీదరైతులకు కావలసిన సామానులు పెట్టుబడిపెట్టి వ్యవసాయము చేయించుటకును, వృత్తులను వృద్ధిచేయుటకును, తగిన బ్యాంకులు లేవు. ధనికులు హెచ్చుగ వడ్డీ పుచ్చుకొనుటచే అతికష్టముగా నుండెడిది. ప్రస్తుతము గవర్నమెంటువారు కొంచెము వడ్డీకి బదులిచ్చుచుండు వ్యవసాయపు బ్యాంకులను పెట్టి రైతులకుసాయము చేయుచుండుటచేవ్యవసాయముఅభివృద్ధిదశలోనున్నది.

గుణ - ప్రభువులును, ధనికులును, బీదసాదలకు తగిన ద్రవ్యసాహాయ్యము చేయనిచో దేశము ఎట్లు అభివృద్ధిలోనికి వచ్చును?

కళా - ఈదేశమున పది యకరములలో పండు పంటను వ్యవసాయశాస్త్రమెఱింగిన ఇతర దేశీయులు ఒకయకరములో పండింతురు. మఱియొకవిశేషము. తోటలెంత అభివృద్ధిగనున్న అంత హెచ్చుగవానలు కురియుచుండును.

అడవులను కాపాడుచుండుటచేత కలప, వంటకఱ్ఱె లు, దూరముగానుండువారికైననుదొఱకుచుండును. దానికై ఎంతోసొమ్మును ఖర్చుఁబెట్టిఫారష్టు డిపార్టుమెంటు ను గవర్న్మెంటువారు ఏర్పఱచిరి, ఆయుద్యోగస్థులు క్రొత్తక్రొత్త విత్తనములను తెప్పించి కొండప్రాంత ములందు చల్లి చెట్లను వృద్ధిచేయుచుందురు. భూముల ను కొలతచేయుటకు సర్వేడిపార్టుమెంటొకటికలదు.

గుణ - ఆ డిపార్టుమెంటువారు చేయు పను లెవ్వి?

కళా - రివిన్యూబోర్డుక్రింద సర్వే సెటల్మెంటు డిపార్టుమెంటు కలదు. వారివలన భూములు కొలువఁబడి భాగములుగా చేయఁబడును. ప్రతిభాగమునకు సర్వేనెంబర్లు వేయఁబ డును. భూ విస్తీర్ణము, సిస్తు, వగైరా విషయములన్ని యు నిర్ణయింపఁబడిన ప్లానులు అచ్చు వేయబడి యుం డును.

గుణ - ఇట్టి ప్లానులు ప్రతిగ్రామమునకునుతయారుకాఁబడునా?

కళా - ఆహా, కాఁబడును.

గుణ - అవి ఎక్కడనుండును?

కళా - సదరుతాలూకా ఆఫీసులలోను, గ్రామకరణములవద్దను ఉండును.

గుణ - లాభమేమి?

కళా - ప్రతిపొలముయొక్క హద్దులు మారకుండునట్లు దిమ్మె

రాళ్లునాటఁబడియుండును. బలవంతుఁడు పేదవారిపొల
మునుతనదానిలో కలుపుకొనుటకు వీలులేకుండును.
ఇవె లాభములు.

గుణ- గ్రామకరణములు రైతులవద్ద అధికసిస్తు వసూలుచే
సినచో వీనివలన ఉపయోగమేమి?

కళా- అట్లు కాకుండుటకే సర్వేనెంబర్లు, భూవిస్తీర్ణము, నిర్ణ
యింపఁబడినసిస్తు,అసామీలపేర్లతో డిగ్లాటు రిజస్టర్లను
సెటిల్మెంటువారు అచ్చువేయించి తాలూకా ఆఫీసులకు
సప్లై చేసియుందురు. ప్రతిరైతును దానిని కొనితనయొ
ద్ద నుంచుకొన వచ్చును.

గుణ- ఆహాహా, ఏంతచక్కని కట్టుబాటు?
(అంత దౌవారికుఁడు ప్రవేశించి) జయము, జయము,
మహారాజుగారికిని, మహామంత్రిగారికిని.

గుణ- రైవతక; ఏమి విశేషము?

దౌ- మహారాజ; జగన్నాథసిద్ధాంతిగారు దయచేసి మొగ
సాలవద్ద నున్నారు.

గుణ- శీఘ్రముగా తోడుకొని రమ్ము.

దౌ- చిత్తము మహారాజునాజ్ఞ; (అనిపోయి మరల-సిద్ధాం
తిగారితో ప్రవేశించి) జయము, జయము.

గుణ- (దౌవారికునితో) ఇఁక నీపనిఁ జూచికొనుము.

దౌ- చిత్తము మహారాజునాజ్ఞ; (అని నిష్క్రమించును)

జ-సి- (కుడిచేయి పైకెత్తి) మహారాజ;
విజయీభవ- విజయీభవ;

గుణ- ఆర్య; ఇందుపై గూర్చొనుఁడు. (అని కుర్చీనిచూపును.)

జ-సి- చిత్తము. (అని అట్లుచేయుచున్నాఁడు).

గుణ- ఆర్య; ఆయుష్మంతునకు యౌవరాజ్య పట్టాభిషేకము నకు సుముహూర్తమును నిర్ణయించితిరా?

జ-సి- చిత్తమూ మహారాజ; రాఁబోవు విజయదశమీ బుధవారము రోజున తులాలగ్నము బహుప్రశస్థముగనున్నది.

గుణ- మహాసంతోషము, మహాసంతోషము. (తెరలో ఘంటాధ్వని, అందఱు వినుచున్నారు)

గుణ - ఓహో, మధ్యాహ్న సమయమైనది. ఇఁకసభ చాలింతము.

అందఱు-చిత్తము, చిత్తము.

గుణ- ఎవఁడురా, అక్కడ?

భటుడు.(ప్రవేశించి) జయము జయము మహారాజుగారికిని మహామంత్రిగారికిని.

గుణ- జాంగల; అంతఃపురమునకు మార్గముఁజూపుము.

భటు- చిత్తము, మహారాజ; ఇటు ఇటు

(అందఱు నిష్క్రమింతురు.)

---

ఇది, కళాశేఖర చరిత్రమునందు ప్రథమాంకము.

## షష్ఠాంభము.

---

స్థలము, విద్యానగరములోని రాజవీధి.

(శంకరావధానులు ప్రవేశించి తనలో) ఏమి? ఈవిద్యానగిరం వెడవెడలాడు తూంది? ఈవేళనేకదా చిన్న రాజుగారికి యువరాజ్య పట్టాభిషేక మహోత్సవం? యెందుచేతనో అట్టి వుత్సవాలెక్కడా కానరావు? యెవరూ యీప్రసంగమైనా చేయలేద్దే? కోటదేవిడీవద్దకు వెళ్లితే వృత్తాంతం తెలుస్తుంది (పరిక్రమించి) ఇదె సింహద్వారందగ్గరకు వస్తిని, వీరుగో యెవరో మహనీయులు కోటలో నుంచి వస్తున్నారు. వీరివల్ల స్పష్టమవుతుంది, (అని నిలుచున్నాడు అంత పురోహితుడు ప్రవేశించి తనలో) నేడెంత యోగదిన మనుకొన్నామో అంత దుర్దినమైంది? పాపం, దూరదేశాలనుంచి యెందరెందరో మహనీయులు బహుకష్టాలపాలై వచ్చి నిరాశ చెందుతారు. (దృష్టిసారించిచూచి) అయ్యో, యెవరోమహాత్ముడిక్కడనే నిలిచియున్నాడు. (సమీపించి) ఓహో, యెవరో అనుకొన్నాను, శంకరం! యెప్పుడు వచ్చితివి?

శంక- ఓహో, శ్రీరాములన్నయ్యా; నమస్కారములు, ఇప్పుడేవస్తున్నాను.

పురో- చిరంజీవ,చిరంజీవ, తమ్ముడూ; పెద్దాపురంనుంచేనా?

శంక- అవును.

పురో- తమ్ముడూ! వృథా శ్రమపడ్డావు.

శంక- ఏమి? యీవేళ పట్టాభిషేక మహోత్సవమేమో?

పురో- లేదు లేదు, యువరాజుగారగు కళాశేఖర ప్రభువుగారును, పెద్దమంత్రిగారికొడుకు సుబుద్ధియు, కలిసి మొన్ననే యెక్కడికో? యెందుకో? వెళ్లిపోయినారు.

శంక- అయ్యో; యేంగ్రహచారం? అయితే మఱెప్పుడవుతుంది?

పురో- ఏమో, వారిని వెతకుటకు ఘంచి తెలివైన బ్రాహ్మలను మహారాజుగారు ఇస్న నేపంపించినారు. ఆయనచింతకు మేరయే లేదు. అంతఃపురమంతా కలకలమే.

శంక- అబ్బా, అన్నయ్యా; కాళ్లువాచినట్లు నడచివచ్చిన నా శ్రమనుగురించి ఆదేవునికైనా కనికారంలేకపోయింది. శాస్త్రిలు అబద్ధాలుకావు నేను బయలుదేరేటప్పుడు వొంటిబ్రాహ్మణుడు యెదురుపడగానే సంశయించాను, ఫలం వెంటనేకనిపించింది.

పురో- పాపం, శ్రమయే మిగిలింది, అలసట తీర్చుకొందువుగాని యింటికి రా పోదము.

శంక- మంచిది. అన్నయ్యా; నీవిక్కడ యేఃనిలోవున్నావు?

పురో- రాజపురోహితుడుగావున్నాను. రా, ఇక్కడకు దగ్గరనే మాయిల్లు. (అని నిష్క్రమింతురు)

ఇది

విష్కంభము.

శ్రీ

# కళాశేఖరచరిత్రము.

## ద్వితీయాంకము.

---

స్థలము—బెజవాడలోని సత్రము.

(అంత రామశాస్త్రి, వేంకటసోమయాజులు, గోపాలచయనులు, జగన్నాథసిద్ధాంతి, శంకరభట్టు, పెరిదీక్షితులు, ఉపవిష్టులై ప్రవేశించుచున్నారు)

వేం, సో-మనపుణ్యావశమున చల్లగా మన మందఱము ఈ బెజవాడ సత్రము వద్దకు వచ్చినాము.

రా, శా-. వేంకట సోమయాజులుగారూ; ఎంతదేశం తిరిగి వచ్చినావండీ, శ్రమే మిగిలిందిగాని కళాశేఖర ప్రభువు ఎక్కడా కనుపించ లేదు.

వేం,సో- రామశాస్త్రుల్లగారూ; ఒక్కమీరే కాదు ఏమి దుర్ముహూర్తాన బయలుదేరేమో కాని మనమందరం ఒకే ఫలం అనుభవించినాము.

గో,చ- ఆమహారాజుధర్మాన నాకు రామేశ్వరం యాత్ర సిద్ధించింది. యోగంవుంటే యేదో మిష.

జ,సి- గోపాలచేౘలుగారు చెప్పింది నిజమే, ఈమిషచేత మన కసాధ్యమైన యాత్రలు, తీర్థములు అయినాయి.

శం,భ- జగన్నాథ సిద్ధాంతిగారూ; విదేశగమన మెంత లాభ మనుకొన్నారు; అబ్బబ్బ; ఎంతనాగరికత, ఎన్ని కష్ట సుఖములు, ఎన్ని చిత్రములు.

పే,దీ- శంకరభట్టుగారు; మనపుణ్యాం బాగుండబట్టే ఆమహా రాజు కాబుద్ధి పుట్టింది.

వేం,సో- అవును పేరిదీక్షితులుగారు చెప్పింది నిజమే! ఎవరెవ రు యేయేస్థలములు చూచినారో వివరంగా చెప్పండి? కొంతశ్రమ నివారణ మవుతుంది.

రా,శా- ఈ రాజధానీకి మొదటిజిల్లాలు నాలుగు నేను చూసినవి. వాటినే ఉత్తర సర్కారు లంటారు.

వేం, సో- వరుసగా, తు, చ, తప్పకుండా మీకు తెలిసిన సంగ తులు చెప్పండి?

రా, శా- ఆలాగు చెప్పడానికి నా తరమా? జ్ఞాపకం వున్నంత వరకూ చెప్తాను.

వేం, సో- అదే చాల్నయ్యా, వెఱ్ఱిబ్రాహ్మణుడా; చెప్పండి?

రా, శా- మొట్టమొదట గంజాం జిల్లాకు ముఖ్యపట్టణమగు బరహాంపురం వెళ్లినాను. అక్కడివారు ఓఢ్రం, తెలుగు, మాట్లాడుతారు, అధికంగా పట్టుబట్టలు నేస్తారు.

వేం, సో- రాజున్న స్థలమేనా?

రా, శా- కాదు. కాని 18 జమీందారీ లా జిల్లాలో వున్నవి.

వేం, సో- అబ్బా, అవన్ని గొప్పవేనా?

రా, శా- అందులో కల్లికోట, పెద్దకిమిడి, చిన్నకిమిడి, పర్లాకిమిడి, చీకటి, మందసా,ఇవిమాత్రంపెద్దవి. ఈజమీందార్ల పెద్దపెద్ద యింగ్లీషుబడులను, స్వేయముగా పెట్టించినారు.

వేం, సో- ఇవన్నీ పాఠైన స్థలాలేనా?

రా, శా- మలయకొండలనీ ఆజిల్లామధ్య వున్నాయి. అందుచే తఱచుగా కొండదేశంలాగు కనఁబడుతుంది.

వేం, సో- మఱే స్థలాలు చూచినారు?

రా, శా- అసిఖా, గోపాలపురం, కళింగపట్నం, శ్రీకాకుళం.

వేం, సో- ఇవన్నీ ఆజిల్లాలోనివేనా?

రా, శా- అవును. మఱొకవింత, శ్రీకూర్మక్షేత్రం ఆ జిల్లాలోందేనుమండీ.

వేం, సో- ఆపట్నాల్లోని వింతలేమిటి?

రా, శా- అస్కాలో చక్కెరచేసే,గొప్ప ప్యాక్టోరీ కలదు. గోపాలపురం, కళింగపట్నం, దేవస్థలాలు, శ్రీకాకుళము జిల్లాకు దక్షిణపు కొన.

వేం, సో- పుణ్యస్థలాలు నదులు వున్నాయా?

రా, శా- లేకేమి? ఆజిల్లా అంతటికి పెద్దనది వంశధార. ఆతీరమందే ముఖలింగమని దివ్యమైన శివక్షేత్రంవుంది

యుగముల తరబడినుంచీ కళింగదేశపు మహారాజుల కది ముఖ్యపట్టణమట. ఇక ఋషికుల్యానది రెండవ రకం.

వేం, సో- భూములు, పంటలు, యేలాగున్నాయి?

రా, శా- భూములు • సారమైనవే, చాలావరకూ · లువలు న్నాయి. వరి ముఖ్యపంట, చెఱకు, జొన్నలు, రాగులు, మధ్యమం, సముద్రంవొడ్డునే వుద్దానమని వొక గొప్ప తోటవుంది. అందులో లేని ఫలజాతు లెక్కడా లేవు. ఇక మన విశాఖపట్నంజిల్లా ముచ్చట. జయపురం రాజ్యం కొండదేశం,అదేజిల్లాకు సగంకంటేఅధికం, విజయనగరం గొప్ప మహారాజున్న పట్నం, అక్కడ బి.యే.కాలేజి వుంది, తరువాత బొబ్బిలి, భీమునిపట్నం విశాఖపట్నం, రేవుస్థలాలు.

వేం,సో- ఆ జిల్లావిశేషాలు మరేమైనా వున్నాయా?

రా,శా- ఆహా, గవర్నమెంటుతాలూకాలు మూడున్నాయి, భూములు సారవంతమైనవే, నేను చూచినంతవరకు వరి ముఖ్యమైనపంట, తక్కినవి గంజాం జిల్లావలెనే పెద్ద నది నాగావళి, తోటపల్లివద్ద క్రొత్తగాదానికి ఆనకట్టు కట్టి కాలువలు త్రవ్వినారు. తరువాత సువర్ణముఖి, దానినీరు మిక్కిలి ఆరోగ్యకరం, పిమ్మట శారదానది, దానియొడ్డునే అనకాపల్లి కలదు, సింహాచలం గొప్ప యాత్రస్థలం, విశాఖపట్నంలో దాతవుపని చక్కగా

చేస్తారు,భోజనసౌఖ్యంవిశేషంగాకలదండి ఆజిల్లాల్లోను?

వేం,సో- ఇ౦కా యేం విశేషాలు?

రా,శా- అక్కడి కంతే, ఇఁక గోదావరిజిల్లా సంగతి వినండి. పిఠాపురం గొప్ప సంస్థానం, కాకినాడ రేవుపట్నం, గోదావరి పెద్దనది, అందుచేతనే ఆజిల్లాకు ఆపేరు వచ్చింది.

వేం,సో- అంత పెద్దదటయ్యా; వినడమేగాని చూడలేను.

రా,శా- మొన్న రైలుమీఁదనుండేనా చూడలేదా?

వేం,సో- లేదండి, ఆపాడు మెయిల్ బండిలో చోట్టే లేకపోయింది, ఇసగవేస్తె రాలనంత రొక్కటంగా ప్రజకమ్మివేశారు, దానికినాయం అర్ధరాత్రి, ఇంతకూ ప్రాప్తిలేదు, అది యెంతవెడల్పండి?

రా,శా- ధవళేశ్వరంవద్ద కాటన్ దొరగారు సుమారు ఆఱుమైళ్లవెడల్పున ఆనకట్టుకట్టించి కాలువలలోనుంచి జిల్లా అంతటికి ఆనీటిని పాఱింపఁజేసినారు. ఏమి పంటలయ్యా! ఎక్కడ చూసినా కొబ్బరితోఁటలే, యెక్కడచూసినా పోకతోఁటలే, యెక్కడచూసినా చెఱకుతోఁటలే, అబ్బబ్బ, కాశ్మీరఖండికండి. నల్లభూమికాని ఈకృష్ణజిల్లా ఆదేశమువ్వు కృష్ణకాలువలచేత.

వేం,సో- బలే, ఆఱుమైళ్లువెడల్పే? తెల్లదొరలబుద్ధి కసాధ్యం లేదుసుమండీ,ఈ కృష్ణకాలువను, తిన్నగ చెన్నపట్నం

వరకూతీసుకొనిపోయినారు, వాళ్ల నేర్పుకూ వాళ్లసామ
ర్థ్యానకూ విలవేలేదు, పెద్దనది వుండభయం, ఉంటే
మఱి సముద్రముఖాన్ని చూడదు.

రా, శా- అవునంశ్, గోదావరినీ, కృష్ణను, కలిపి వేశారుకాలువ
లచేత; రాజమహేంద్రవరం గోదావరి వొడ్డునే వుంది,
అది తెలుగు భాషకు పుట్టిల్లు. ఇక్కడికి దగ్గరగానే
బందరుంది, అది రేవుపట్నం, ఏలూరు కొంచెం వుత్త
రంవైపు, అక్కడ రత్నకంబళ్లు తయారుచేస్తారు, ఇక్క
డే జగ్గయ్యపేటలో పూర్వంనల్లమందు వర్తకం అధిక
మఁట, కొల్లేటికొంగలు, కొల్లేటి దోమలు, అని ప్రసి
ద్ధిని వినియున్నారు గదా? ఆసౌభాగ్యం యీజిల్లాలోని
దే, అదే కనకదుర్గాలయం, ఇఁక సోమయాజులుగారూ!
మీా వృత్తాంతమును చెప్పండి?

వేం, సో- నేను చూసినవి తూర్పంచువే అయిదు జిల్లాలు.

పే, దీ- ఒకదానికోటి దక్షిణంగావుంటే తూర్పంటారేమి సోమ
యాజులుగారూ?

వేం, సో- ఇక్కడికి దక్షిణమేకాని రాజధానికి తూర్పుభాగం
కాదటండీ? మఱీవినండి; చెన్నపట్నాని కావల మఱి
యీారైలుకాదు, అది చిన్నది, దానిని దక్షిణపిండియా
రైలంటారు.

శం, భ- అదేమిటది, అంతాయీారైలేకాదూ? అదివేరా?

వేం,సో-అయితే రైళ్లముచ్చట బాగావినండి. చెన్నపట్నం నుంచి మూడుత్రోవలున్నవి. ఒకటి దక్షిణంగా తిరునల్వేలిజిల్లాకు పోవును. అదే దక్షిణఇండియారైల్వే. మఱొకటి వాయవ్యమూలగా బొంబాయికి పోవును. దానినే చెన్నపురి యినుపదారంటారు, వేరొకటి ఉత్తరంగా కలకత్తాకు పోవును. తూర్పుతీరపు రైలంటారు దానిని. మైసూరులోని దానికి దక్షిణమహారాష్ట్రరైల్వే అని పేరట.

గో,చ- ఇన్ని సంగతులు మీకెట్లు తెలిశాయి సోమయాజులు గారూ?

వేం,సో-చెన్నపట్నంలో రైలుస్టేషన్ మాస్టరింటనే నాబస. అప్పుడాయన యీమర్మాలన్నీ చక్కగా చెప్పినారు. ఈరైళ్లకు గుంతకల్లు, ధర్మవరం, బెంగుళూరు, జోలారుపేట, ఈరోడ్డు, పోదనూరు, పాలఘాట్టు, పోరనూరు మణియాచ్చి, మధుర, తిరుచునాపల్లి, తంజావూరు, తిరువాలూరు, మాయవరం, విళుప్పురం, చెంగల్పట్టు, చెన్నపట్నం, ఆర్కోణాం, కాట్పాడి, పాకాల్, రేణిగుంట, గూడూరు, బెజవాడ, స్టేషన్లవద్ద జంక్షన్లంట.

రా,శా- జంక్షన్లంటే జ్ఞాపకం వచ్చింది, నాపడా, విజయనగ

రము, వాల్తేరు, సామర్లకోట, స్టేషన్లవద్దకూడా వున్నాయండీ.

వేం,శా- విశిష్ట్వరానకు బహుసమీపమున వుమచ్చేరని వొక సొగసైన రేవుపట్నంవుంది, అది యీదొరలదికాదంట. మొవనో ఫ్రెంచివారిదంట.

రా,శా-ఎవరోకాదండి వాళ్లకే పరాసువాళ్లని వాడుక.

శం,భ- మీాకెట్లు తెలిసిందండీ?

రా,శా- గోదావరిజిల్లాలో యేనామని వాళ్లకొక పట్నం వుంది. అక్కడ వాళ్లవృత్తాంతం స్పష్టంగా తెలిసింది. మళయాళతీరంలో మాహీ అనుపట్నం వాళ్లదేయంట. ఇంతేకాదు కలకత్తా దగ్గర చంద్రనాగూరు, తంజాపూరువద్ద కారికల్,వాళ్లవేయంట.

జ,సి- మనహిందూదేశంలో గోవా, డయ్యూ, డామన్, అని మూడు పట్నాలు బుడతకీచువాళ్లకు కూడా వున్నాయంట.

శం,భ- బుడతకీచువాళ్లేమిటి? బుడతకీచు,గిడతకీచు,అని యిన్ని వాళ్లున్నారా?

జ,సి-మనవాళ్లాలా గంట్రాచుగాని వాళ్లు పోర్చుగీసువారంట.

వేం,శా- ఇన్ని పట్నాలు చూశానుగాని చెన్నపట్నంతో నమానమైనపట్నం వొకటైనా లేదండి

గో,చ- అవునఁట సోమయాజులుగారూ; దాని విశేషాలు చెప్పండీ? ఏమిటో మెఱుపుబళ్లఁట? మోటబళ్లట? పట్నంలోనే రైలుబళ్లఁట? బహుచిత్రంగా వుంటాయఁట?

వేం, సో- అబ్బో,అవన్నీ నాతరమా? ఒక్కపట్నమే వొకజిల్లా. వెతిగినా కొండ కనుపించదుకదా? వూరు చుట్టూ రైళ్లే. చిన్నదిగాని రైలు పెట్టెలాగే వుంటుంది ట్రాంబండి. దానినే మెఱుపుబండి అంటారు. అది నడివీధులలోనే పరుగెత్తుతుంది. నాలుగు రబ్బరుండలతో వుంటుంది మోటారుబండి. ఆబండి క్రిందనే పిడుగు యంత్రం వుంటుందఁట త్రాచు పాం బుస్సుపెట్టినట్లు ఝూంకారం చేస్తూపరుగెత్తుతుంది. దానివేగమూ రెయిళ్లకు గియిళ్లకు లేదు.సముద్రంలో మైలువెడల్పునా, మైలుపొడవునా హార్బరుకట్టినారు. ఎప్పుడూపదిష్టీమర్లందులో నిలవ.పోర్టుసెంటుజార్జి అనుకోట వొకటి గవర్నమెంటువారికికలము. ఆకోట శిఖరములు నేలమట్టముతో సరిగా వుంటవి. వేరే మఱొక గొప్పభవనముకూడా వారికి కలదు. అందులో గవర్నరుగారు కాపురం వుంటారు. హైకోర్టు వొకటి అందులోనే లైటుహౌసువొకటి వున్నాయి. ఎన్నోపేటలు. మెన్నోకాలేజీలు. వొకటేమిటండీ, రాజధానిస్థలం. అన్ని డిపార్టుమెంట్లకూ హెడాఫీసు లక్కడే.

జన్మలైదులక్షలంట. అరవై వేల యిండ్లంట. అరవం, తెలుగు, ఇంగ్లీషు, హిందూస్థాని, ఈ నాల్గుభాషలు రాని వారు తక్కువ. అన్ని జాతులవారికి దేవబ్రాహ్మణభక్తి మెండు. మ్యూజియములో చచ్చిన జంతుకళేబరాలెన్నో నిలవ. అందులో వొకభాగంలో ఓరియంటల్ లైబ్రరీ అను పుస్తకభండారమును గవర్నమెంటువారుంచినారు. అక్కడయెన్నెన్నో రకాలవ్రాతపుస్తకాలు, శాసనాలు, కలవు. బ్రతికిన జంతువులెన్నో రకాలు పీపిల్సుపార్కనబడు రాణీతోటలో వున్నాయి. ఎన్ని పటాలములు, యెంతసైన్యము, ఆసౌభాగ్యమంతా చూసేతీరవలెను.

గో, చ- నదీతీరమేనా?

వేం, సో- కూవం, అడియార్, అని రెండు చిన్ననదులున్నాయి కాని వాటి వుపయోగమే లేదు. నదెందుకండి? ఎక్కడ కోరితే అక్కడే కొళాయీలు, యిట్టే అంటే యేనుగు తొండాంతో వంపినట్లు ధార, స్వచ్ఛమైన గంగ.

గో, చ- దేవాలయాలున్నాయా?

వేం, సో- అధమం అయిదో ఆరో దేవాలయాలులేని వీధియే లేదు,

శం, భ- చెన్నపట్ణం టోపీ అంటారు అదేమిటండి?

వేం, సో- ఆహాఁదగాకు పుట్టినిల్లు. ఇంతకూఁఇవతలివాని తెలివిలో వుంది. ఆపట్టం భూలోకస్వర్గం.

గో, చ- ఆహాహా, ఎంతధన్యుఁడవయ్యా; మఱెక్కడైనా యాత్రస్థలాలు గొప్పగొప్పదేవాలయాళు వున్నాయా?

వేం, సో- లేకేమి? చిదంబరంలో గొప్పశివాలయంవుంది. కంచిలోను అరుణాచలంలోను అట్టివే. కాళహస్తికే దక్షిణకాశీ అని పేరు.

గో, చ- ఓహో, స్మరణాదరుణాచలం అన్నాడు. ఇఁక కల్హారచూస్తే దాని ఫలం చెప్పడాని కెవరితరం?

శం, భ- అట్లంటున్నారేమి చేన్లగారూ; మీరుచేసిన సేతుయాత్రాఫలం తక్కువనుకొన్నారా? యాత్రా లేక, తీర్థం లేక పాడు మెరక జిల్లాలు తిరిగివచ్చినవాణ్ణి వుక్కనేనే గాని.

రా, శా- మీయోగమదే. గతించినదానికి వగచిన లాభమేమి? ఇఁకసోమయాజులుగారు! చెప్పండి, పంటగలజిల్లా లేనా?

వేం, సో- వరి, నీలిమందు, చెఱకు, వుకమోస్తరు. తక్కినవి సాధారణం, యేవీ, యెక్కడైనా పెద్దనదులుంటేనా? నెల్లూరుజిల్లాలో వుత్తరపెన్న, దక్షిణార్కాడుజిల్లాలో దక్షిణపెన్న, యివే పెద్దనదులు.

రా, శా- పాలయవేర్కాడు సరస్సంటారు అదెక్కడ?

వేం, సో- అది నెల్లూరుజిల్లాకు దక్షిణంకొసన.

గో, చ- సోమయాజులుగారు! ఆజిల్లాల్లో విశేషాలేమిటి?

వేం, సో- ప్రతిజిల్లాలోను బట్టలు నేస్తారు. నీలిమందు, వుప్పు, నారలు, చమురు, తయారుచేస్తారు. చెన్నపట్నం చుట్టూవుంది చెంగల్పట్టుజిల్లా. అందులో సైదాపేటకలదు. అక్కడ టీచర్లకాలేజీవుంది. పక్షితీర్థం ఆజిల్లాలోనిదే. నెల్లూరుజిల్లా పశువులకు ప్రసిద్ధి. దక్షిణార్కాడు జిల్లాలో యినుము దొరుకుతుంది. గుంటూరుజిల్లాలో గుంటూరు దూదిపనులకు ప్రసిద్ధి. ఆజిల్లాలో వొంగోలొకటి పెద్దపట్నం. అక్కడ మిషనరీలు తఱుచుగావున్నారు. ఇఁక చేన్లగారు! మీవృత్తాంతమేమిటో చెప్పండి?

గో, చ- నేనుచూసినవి తూర్పుప్రక్కనేగాని దక్షిణపుకొన. కనండి, తంజావూరు, తిరుచునాపల్లి, ఈరెండుజిల్లాల్లోను కావేరికాలువలవల్ల పంటలు సమృద్ధిగా పండును. తిరుచునాపల్లిజిల్లాలో శ్రీరంగము జగత్ప్రసిద్ధమైన దేవస్థలము. అక్కడే కావేరి రెండుశాఖలైంది. వుత్తరపుశాఖకు కొల్లడమనిపేరు. మధురలో వైఘ, తిరునల్వేలిలో తామ్రపర్ణి, నదులున్నాయి. యెఱ్ఱమట్టి భూములలో పాఱుటచేత నీ రెఱుపు గనుక తామ్రపర్ణి అని పేరు వచ్చినది. తిరునల్వేలిజిల్లాయీరాజధానికి దక్షిణంకొస.

అక్కడే కన్యాకుమారీ అగ్రం వుంది. మధురజిల్లాలో రామనాథాగ్రం వుంది. పాంబన్ కాలువ అక్కడే. అది దాటితే రామేశ్వరందీవి. దానికీ లంకకూ మధ్య మన్నారుద్వీపం వుంది. వుత్తరానకు కాశీయెట్టిదో దక్షిణానకు రామేశ్వరం అట్టిది.

వేం, సో.- అందుచేతనే కాశీ రామేశ్వరా లని లోకప్రసిద్ధి.

జ, సి.- ముత్యాలు శంఖాలు దొరుకుతాయఁట యెక్కడ?

గో, చ.-తిరునల్వేలిజిల్లాలో. సోమయాజులుగారూ! ఆజిల్లాలో కుత్తాలందగ్గర తామ్రపర్ణీనది చక్కని స్నెలయేటిలాగు యేడుతాళ్ల యెత్తునుంచి నేలఁబడుచున్నది. తంజావూరుజిల్లా యీరాజధానికి వుద్యానవనంవంటిది. అందులో కుంభఘోణం వుంది; యేం చెప్పుదును, బ్రాహ్మలపుట్ట. ఆ తపస్సులేమి,ఆ కర్మలేమి, ఆ వేదశాస్త్రిలేమి,ఆ సంగీతాలేమి; గవర్నమెంటువారి పెద్దకాలేజీకూడా వుంది. నాగపట్నం ఆజిల్లాలో రేవుపట్నం.తరంగంబాడి మును పా జిల్లాకు ముఖ్యపట్నమఁట.దానిని డేనులవద్ద యింగ్లీషువాళ్లు తీసుకొన్నారఁట. ఇప్పుడు తంజావూరే ముఖ్యపట్నం.

జ, సి.- మరేం విశేషాలు?

గో, చ.- ఆ జిల్లాలో బెంకుబొమ్మలు, కంబళ్లు, మొదలైనవి చేస్తారు. తిరుచునాపల్లి పొగచుట్టలకు ప్రసిద్ధి. అక్కడ

బంగారు నగలుచేస్తారు. అటుపై పన్నీ దేవతాస్థలాలే. అన్నీ సత్రాలే. పాలయంకోట తిరునల్వేలిజిల్లాకు ముఖ్యపట్నం. తూత్తుకుడి రేవుపట్నం. ఆజిల్లాలో ప్రత్తిపంట మెండు. జిల్లాఅంతా తాటిచెట్లే మధురజిల్లాలో దిండిగల్లు పెద్దపట్నం రామనాధపురం, శివగంగ, జమీంధారీస్థలాలు.

జ- సి- కొండప్రదేశాలా?

గో, చ- కావు తంజావూరుజిల్లాలోకొండ లేదు. తిరుచునాపల్లి జిల్లాలో పచ్చమలకొండలు, మధురజిల్లాలో సరుమల కొండలు వున్నాయి

జ, సి- ఇంకా యేం విశేషాలు?

గో, చ- ముఖ్యమైనవేవో చెప్పివేశాను, ఇక మీరు చెప్పండి?

జ, సి- నేనుచూసిన జిల్లాలలో అరవంశన్నడం,తరుచు. తెలుగు సకృతు. అందుచేత విశేషాలంతగా తెలియలేదు. అయినా వినండి. మొట్టమొదట తిరుపతివెళ్లి శ్రీవేంకటేశ్వర్లవారి దరిశనంచేశాను. ఆయన శేషాద్రిమీద వున్నారు. ఆకొండ రెండువేల అయిదువందల అడుగులు వుంటుంట. అక్కడ నిత్యయాత్ర. ఏమి స్వామండి; వైకక్క చిత్రం. ఆస్వామి సంచికట్టులేని వైద్యుండు. భూములులేని కలక్టరు. సర్వసమత్వమంటే ఆయనకేచెల్లును.

శం, భ- అట్లంటే తెలియలేదు, సిద్ధాంతిగారూ! బాగా చెప్పండి?

జ, సి- ఎంతరోగంవచ్చినా ఆయనకు నమస్కారం చేయగానే గాలికి మేఘూలెగిరిపోయినట్లు నూయమై పోతుంది. అందుచేత వైద్యుఁడు. మ్రొక్కుబళ్లసొమ్ము వేలకువేలు వసూలవుతుంది, అందుచేత కలక్టరు. గొప్పవాఁడేకానీ కొద్దివాఁడేకానీ మొక్కుటపడ్డవానికి శుద్ధశుచరం తప్పదు, అందుచేత సర్వసమత్వం. యింకైనా గొప్ప దేవుఁడండీ;

గో, చ- అయ్యయ్యో, అందఱికూ శుద్ధశుచరమేనా?

జ, సి- అందఱికూనా? మ్రొక్కుకొన్న వాళ్లకు.

శం, భ- బాగానేవున్నది. మరేం విశేషాలు?

జ, సి- అక్కడ కఱ్ఱబొమ్మలు యిత్తడిసామానులు తయారు చేస్తారు. అది ఉత్తరార్కాడు జిల్లాలోనిది. వేలూరొకటి పెద్దపట్నం. చిత్తూరు ముఖ్యపట్నం. ఆజిల్లాలో మామిడిపండ్లు నారింజపండ్లు అనంతం. వందవాసిలో తుంగచాపలు, కాళహస్తిలో గాజులు. వాలాజీపేటలో రత్నకంబళ్లు, తయారుచేస్తారు.

శం, భ- ఇవే జిల్లాలోనివి?

జ, సి- ఉత్తరార్కాడు జిల్లాలోనివే. సేలంజిల్లాకు సేలమే ముఖ్యపట్నం. అక్కడ మంచి తివాసీలు చేస్తారు.

కోయంబుత్తూరు మంచి ఆరోగ్యకరమైన స్థలం. ఆజిల్లా లోనిదే యీరోడ్డు. అది వర్తకస్థలం. నీలగిరి జిల్లాలో వుదకమండలమును చెప్పేదేమిటి? మండు వేసవిలో కూడా హిమము కురుస్తూ వుంటుంది.

రా, శా- ఎందుచేతనో కారణం తెలుసునా? భూమికి యెత్తుగా వుండే స్థలంలో చల్లగా వుంటుంది. దీనికొక దృష్టాంతం వినండి. అన్నికొండలకంటే యెత్తయినవి హిమాలయాలు. అందుచేత మంచు యెల్లప్పుడు అక్కడ వుంటుంది. ఆలాగే మొదట ఆనీలగిరి భూమి మైసూరు పీఠభూమితో కలిసివుంది. అందుచేత భూమే చాలా యెత్తు. అందుమీద వున్నాయి కొండలు. దానికి సాయం సముద్రం దగ్గర. ఇంక అక్కడ చల్లదనాని కేంలోపం?

జ, సీ- ఈ రాజధానిలోని పెద్దపెద్ద దొరలు, మహారాజులు, వేసవికాలంలో చల్లదనంకోసం అక్కడకు పోతారు. ఆజిల్లా చిన్నదిగా కనుపించిందండీ?

రా, శా-అవును భూగోళపటంలో చూస్తే నీలగిరిజిల్లా అన్ని జిల్లాలకంటే చిన్నది. విశాఖపట్నంజిల్లా అన్నిజిల్లాలకంటే పెద్దది.

శం, భ- గొప్ప నదులు న్నాయా?

జ, సి- సేలంలో దక్షిణపెన్నానది, కోయంబుత్తూరులో కావేరి, వుత్తరార్కాడులో పాలేరు, ఇవె నదులు. ఇవన్నీ మైసూరు రాజ్యంలో పుట్టినవఁట.

శం,భ-కొండలో?

జ, సి- తూర్పుకనమల వరుస కలదు. వుత్తరార్కాడు జిల్లాలో నగరికొండలని, సేలంజిల్లాలో శివరాయకొండలని, కోయంబుత్తూరుజిల్లాలో బిళిగిరిరంగన్‌కొండలని, ఆ వరుసకే పేర్లు. వాటికొనే నీలగిరిజిల్లాలో నీలిరంగుగావుంది. అందుచేతనే దానికి నీలగిరిజిల్లా అని పేరువచ్చిందఁట. భట్టోజీగారు! ఇఁక మీరుచూసినవింతలు చెప్పండి? ఇంకా సత్రంవేళ కాలేదు.

శం,భ-, నేనుచూసినవి కడప కర్నూలు బల్లారి అనతపురం అని నాలుగు మెట్టజిల్లాలు. అక్కడ వర్షములు తక్కువ. మెట్టుపంట లధికం.

వేం,సో- ఎందుచేత వర్షములు తక్కువండీ?

శం.భ- ఎందుచేతనా? ఆ నాల్గు జిల్లాలకూ డక్కన్ డివిజన్ అనిపేరు. డక్కన్ పీఠభూములవే. అందుచేత భూము లెత్తుగా వుంటాయి వొకటి, ఇఁక రెండోది, యే దిక్కు చూసినా సముద్రం చాలాదూరం.ఆనాల్గుజిల్లాలలోను యెత్తయినకొండ వొకటీ లేదు. మఱి యెత్తయినకొండ లేకపోతే మేఘాలని అడ్డడంయేలాగు?అడ్డకపోతే వర్షం

కుదియుడంయేలాగు? యివె కారణాలు. ఇంక యేజిల్లా కు ఆపేరుగలదే ముఖ్యపట్నం. కడపలో మంచి నీలి మందు తయారుచేస్తారు. బలపపురాళ్లక్కడే దొరుకు తాయి. బళ్లారిలో జంబుఖానాలు రత్నకంబళ్లు నేస్తా రు. బట్టలకు రంగు వెయ్యడం నేర్పు అనంతపురం జి ల్లాది. తెలుగే ముఖ్యమైనభాష. కాని బల్లారి అనం తపురం జిల్లాలకు పడమటి తాలూకాలలో మాత్రం కన్నడం మాట్లాడుతారు.

వేం, సో- భాషంటే జ్ఞాపకంవచ్చింది, చెన్నపట్నానికవతల దక్షి ణదేశమంతా అరవమే మాట్లాడుతారు. ఇంక నదుల యొక్క విశేషాలు చెప్పండి?

శం, భ- బల్లారి కర్నూలు జిల్లాలకు వుత్తరసరిహద్దుగా తుంగ భద్రానది పారి కృష్ణలో కలుస్తూంది. వుత్తరపెన్న కడపజిల్లానుంచే నెల్లూరుజిల్లాకు వచ్చింది.ఇవె నదులు. మిలటరీవున్న స్థలం బల్లారి. ఆజిల్లాలోనిదే ఆదవని దూ దిపనులకు ప్రసిద్ధికలది. అనంతపురం జిల్లాలో గుత్తి, గుంటకల్లు, పెద్దవి. కడపజిల్లాలో చల్లదనానికి ప్రసిద్ధి మదనపల్లి. కర్నూలుజిల్లాలో కంభం, నందియాల, యీరెండూ పెద్దవి.

పే, దీ- కంభమన్నది వూరా? చెరువా?

శం, భ- రెండున్నూ. దీక్షితులుగారూ! ఇఁక మీసంగతి చెప్పండి? స్నానంవేళ కావచ్చింది?

పే, దీ- నేను చూసినవి రాజధానికి పడమటితీరం. వాటిలో నాలుగురాజ్యాలు. రెండుజిల్లాలు.

జ,- సి వాటి పే ర్లేమిటి?

పే, దీ- తిరువాన్కూరు,కొచ్చి, మైసూరు, అందులోనిదే కొడగు, యీ నాలుగు రాజ్యాలు. మలబారు, దక్షిణకన్నడం, యీ రెండు జిల్లాలు.

జ, సి- భూములు, పంటలు, భాషలు,అటువై పేలాగున్నాయి?

పే, దీ- చాలావరకూ పడమటికనమల వరుస వ్యాపించివుంది. ఆజిల్లాలలో కొబ్బరితోఁటలు మెండు. కొండలమీఁద మిరియాలు, యేలకులు, లవంగాలు, కాఫీ, తేయాకు, అల్లం, మొదలైనవి విశేషంగా పండుతాయి. మైసూరు రాజ్యంలో రాగులు (చోళ్లు) పంట అపరిమితం తూర్పుకి బంగాళాఖాతంవలె పడమటికి అరేబియా సముద్రంవుంది. నేనుచూసినంతవరకు అరవం, మళయాళం, కన్నడం, తులు, కొంకణి, అను యీ అయిదు భాషలు మాట్లాడుతారు. భూములు మంచివే. వర్షాలు అధికం.

జ, సి- పెద్ద పట్నాలున్నాయా?

పే, దీ- కొచ్చిరాజ్యంలో యెర్నాకుళం ముఖ్యపట్నం. తిరుచూరు పెద్దపట్నం. అక్కడ క్రీస్తువులధికం. తిరువాంకూరు రాజ్యానకు తిరువనంతపురం ముఖ్యపట్నం. అలప్పి, కోయిల్లాండి, రేవుపట్నాలు. మళయాళంజిల్లాలో కోళికోడు ముఖ్యపట్నం. తలచ్చేరి, బేపూరు, కొచ్చి, రేవుపట్నాలు. కన్ననూరులో సైన్యంవుంది. పాలఘాట్టు గొప్ప వర్తకస్థలం. అదిపడమటికనమల లోయలో వుంది. దక్షిణ కన్నడంజిల్లాకు మంగుళూరు ముఖ్య పట్నం.అదే రేవుపట్నం. వుడిపి దేవాలయాలకు ప్రసిద్ధి. **42**అడుగుల యెత్తుగల గుమ్తరాజా అను రాతివిగ్రహం ఆజిల్లాలో కర్కాలా అనుపట్నంలో వుంది.

జ, సి- నదులో?

పే, దీ- మలబారులో పొన్నానినది. దక్షిణకన్నడంలో వేత్రావతి. కొచ్చిరాజ్యంలో పొన్నాని, పెరియారు, అను నదులు పారి అరేబియాసముద్రంలో పడుతున్నాయి.

జ, సి- పడమటిసముద్రంలోకంటె తూర్పుసముద్రంలో పడే నదులు అధికము సుమండీ;

పే, దీ- ఈరాజధానికి తూర్పుభాగంకంటె పడమరవైపు వెళ్లుతున్న కొద్దీ యెత్తుగావుందిభూమి. అందుచేత తూర్పుగా పారేనదులు అధికం.

జ, సి— అయ్యా దీక్షితులుగారు! సూక్ష్మంగా రాజ్యముల ముచ్చట చెప్పండీ?

పే, దీ- రాజ్య మనగా గవర్నమెంటువారికి ప్రతి సంవత్సరము పన్నుకడుతూ స్వయంగా యేలుకొంటూవున్న మహారాజులయొక్క దేశానికి పేరు. ఈరాజధానీలో అన్నిటికంటే మైసూరురాజ్యం పెద్దది. దానికంటే పెద్దదంట దానికుత్తరంగా వున్న నైజాంరాజ్యం. దాన్ని నవాబు యేలుచున్నాడంట. ఈరాజ్యాలలోకూడా ఇంగ్లీషు వారి సలహాలకొఅకు రెసిడెంట్లను, ఛీప్‌కమీషనర్లను, వుంచినారు. మైసూరికి బెంగుళూరు ముఖ్యపట్నం. పూర్వం శ్రీరంగపట్నమంట. మైసూరు, షిమొగె, కోలారు చిత్రదుర్గం, ఇవి పెద్దపట్నాలు. అందులో బంగారు యినుము గనులు దొరుకుతాయి.శంకరాచార్యస్వాములవారి శారదాపీఠమున్నశృంగేరికూడా అందులోనిదే. ఆరాజ్యంలో నైఋతిమూలను కొడగురాజ్యంవుంది. దానికిముఖ్యపట్నం మర్కారా; ఇవే విశేషాలు.

సో, చ- ఇంక స్నానానికి లేతామా? వేళ కావచ్చింది.

(అంతనారాయణ, జోగన్న ప్రవేశింతురు.)

నారా- అయ్యా, శాస్త్రుర్లుగారు; ఇందులో సాక్షిసంతకం చెయ్యండి; (అసిక్రయచీటినియిచ్చును)

రా, శా- (అందుకొని) ఏమిటండి యిది?

నారా- చదివిచూడండి యిది క్రయచీటి;

రా, శా- (స్టాంపును పట్టుకొని) నాలుగువేల రూపాయీల క్రయచీటీ(అని చదువుటకు ప్రారంభించును)

I. 1910 సం॥ రం, ఏప్రెల్ తే 7 దీని, విశాఖపట్నం జిల్లాబొబ్బిలిసబురిజష్టారు యిలాకా కృష్ణారాయపురం అగ్రహారంకాపురస్థులు, బ్రాహ్మణులు, యినాందార్లు, అయ్యల సోమయాజుల సోమన్నగారి కొమాళ్లు నారాయణంగారికి.

కృష్ణజిల్లా, బెజవాడ సబురిజష్టారు యిలాకా బెజవాడ కాపురస్థులు, బ్రాహ్మణులు, యినాందార్లు, నేమాని లేటు అప్పన్నగారి కొమాళ్లు జోగన్న వ్రాయించి యిచ్చిన శుద్ధక్రయచీటి.

II. సదరు బెజవాడ గ్రామంలో వున్నటువంటిన్నీ, యీ దిగువ వ్రాసిన పె.ద్యూలు దాఖలా కలదిన్ని, నా పిత్రార్జితమై నేటివరకు నా స్వాధీనానుభవంలో వున్నటువంటిన్ని, నెం, 306రు పట్టా కలదిన్ని, నాలుగు యకరముఁలు పరిమితిగల పల్లం భూమిని మీకు యివ్వనిర్ణయించుకొన్న యేతత్కాలోచిత క్రయధనం రూపాయీలు- రు 4000-0-0 లు, వ్రాలను నాలుగువేల రూపాయీలకు శుద్ధక్రయానకు యిచ్చివేసిని, గనుక సదరు క్రయ

ధనం క్రయకాలమందే నగదు ముట్టినది. ఈ వెంటనే మీా స్వాధీనం పటిచివేస్తిని గనుక యింతటినుంచి సర్కారుపన్నులు చెల్లించుకొంటూసదరుభూమియందు గల వాప్యాది సత్త్వసహితంగా మీా పుత్ర పౌత్ర పారంపర్యం సమస్త హక్కులతోనూ శాశ్వతంగా సుఖాన అనుభవించవలెను.

---

III. షెడ్యూలు.

1. కృష్ణజిల్లా.
2. బెజవాడ సబ్ రిజష్ట్రారు యిలాకా.
3. బెజవాడ గ్రామం.
4. పట్టా భూమి.
5. కృష్ణానది కాలువ పారేది.
6. పల్లం, నాలుగు యకరములు.
7. పన్ను, యిరవై రూపాయీలు.
8. సిస్తు, నూటయేభై రూపాయీలు.
9. హద్దులు.

(1)తూ॥ రెడ్డి గోపన్న తా॥ పల్లం.

(2)ద॥ డిటో

(3)ప॥ పశువుల గోజా.

(4)ఉ॥ రెడ్డి ఆప్పాయతా॥ మెరక.

* నేమాని జోగన్న వ్రాలు-

ఇందుకు సాక్షులు-

దస్తూరీ గురుకుల సర్వేశది.

రాశా- (నారాయణిపై వ్రుచూచి) మీది విశాఖపట్నం జిల్లా కదా? ఇక్కడేలాగు యీవ్యవహారం చేసినారు?

నారా- చెన్నపట్నంనుంచి వస్తున్నాను. అకస్మాత్తుగా యీ వ్యవహారం తటస్థించింది.

జ,సి- సొమ్మంతా చెల్లించేశారా?

నారా- మూడు వేలు నగదు చెల్లించాను. తక్కిన వేయింటికి యిదుగో ప్రోనోటు.(అని నోటును జోగన్న వద్ద తీసికొని జగన్నాథ సిద్ధాంతిచేతి కిచ్చును.)

జ, సి- (నోటును తనలో చదువుకొని, ప్రకాశముగా) దీనిని కుఱ్ఱవానిచే వ్రాయించినారా యేమి?

జోగ- ఏమండోయ్, ఆలాగంటున్నారు?

జ, సి- మఱేం లేదు, నోటు చెడింది.

జోగ- అయ్యో; ఏమి?

జ, సి- మీపేరు జోగన్నగారు గదా?

జోగ- అవును.

జ, సి- మీపేర నారాయణంగారుగదా నోటును వ్రాయించి యిచ్చేవారు?

జోగ- అవును.

జ, సి- జోగన్నగారికి వ్రాయించియిచ్చిన అని వుండవలసిన చోట జోగన్నగారు వ్రాయించియిచ్చినఅని వున్నది. కి అను షష్టీవిభక్తికి, రు అను ప్రథమావిభక్తి పొరబాటున పడింది. అందుచేత మీరే వారిపేర నోటువ్రాసి యిచ్చినట్లు అర్ధ మవుతుంది.

జోగ- అయ్యో; నారాయణగారూ; మీరైనా చూడలేదా?

జ, సి- ఇంకా వినండి; బదులు వాడుకొనుచున్న రూపాయీలు అనివున్నది. వాడుకొనుచున్న అన్నది వర్తమానకాలం-వాడుకొంటేనేగాని నోటు పుట్టదుగదా? అందుచేత వాడుకొన్న అని భూతకాలం వుండవలెను.

జోగ- సరే, అంతా బాగానే వుంది.

జ, సి- మఱొకటి వినండి; వ్రాలను వేయిరూపాయికి అనివుంది. వేయిసంఖ్య బహువచనం, రూపాయి యేకవచనం, కనుక వేయిరూపాయీలకు అని వుండవలెను.

జోగ- వొక్క నోట్లో యిన్ని తప్పులేమిటండోయ్?

జ, సి- ఆ పిల్లవాఁడు ప్రైమరీ అయినా చదువుకోలేదు కాబోలును. అదిచదివితే కొంతవరకు తెలివి కుదురును. యింకొకటి వినండి. నేను పుచ్చుకొందువుఅని వ్రాశాడు. నేను అన్నది వుత్తమపురుష. పుచ్చుకొందువు అన్నది

మధ్యమపురుష. నేను అన్నది కర్త. పుచ్చుకొందువు అన్నది క్రియ. కర్త యే పురుషయం దుంటుందో క్రియ కూడా ఆ పురుషయందే వుండవాలి.—ఇది వ్యాకరణ శాస్త్ర మర్యాదా. కనుక నేను పుచ్చుకొందును అని వుండవలిసింది.

జోగ- నారాయణంగారూ! వేరే మఱొక నోటు వ్రాయండి, ఆ అణా బిళ్ల (స్టాంపు) నేనిచ్చుకొంటాను.

నారా- మంచిదే. కాని రైతుని పిలిపించండి కదసాక్ష్యకోవాలి,

జోగ- ఆలాగే, అయ్యా! నోటు తెండి, (అని పుచ్చుకొని నిష్క్రమించును.)

నారా- (వ్రాత నభినయించును, అంత జోగన్న రైతుతో ప్రవేశించును.)

జోగ- అయ్యా: ఇదుగో రైతు.

నారా- (రైతునుచూచి) ఏమోయి నాయన? నీపేరేమిటి?

రైతు- బాబు, దండాలు, దండాలు, నా పే రప్పల్నాయుడు. మా యింటిపేరు కళ్లోళ్లు.

నారా- సరే, కూర్చో. (రైతు కూర్చుండును)

నారా-వ్యవసాయంపని బాగా తెలుసునా? మాది దేశంకాదు. నాలుగువేల రూపాయలిచ్చి యిక్కడ భూమిని కొనుక్కున్నాను. నీకొప్పగించవా లనుకొంటున్నాను.

రైతు- యిదేటండో బాబు; యవసాయంసంగతి నాకు మీరు సెప్పేదేంటి? సల్ది కంబల్లేనోడుకూడా రైతేనా? బూదేవత నేయాల యాలాగు తయారు సెయ్యాలో తక్కిన నా యాళ్ల కేం తెల్సును?

నా, రా- ఏలాగు తయారు చెయ్యాలో చెప్పావూ? విని సంతోసిస్తాను.

రైతు- సిత్తం, ముందుకుండా బూదేవతని పెల్లెక్కదున్ని యాల, మూడునాల్గు దుక్కులేస్తే కిందిమన్ను మీదికి మీదిమన్ను కిందికి పడి గుండగై గాలిపారి మంచి సారం సేస్తాది, యెంతనోతుగదుంతే అంత గుల్లవుతాది, గుల్లవాత్తేనే యేట్టి దట్టాగావారి మొక్క పెరుగుతాది, అందుకే తెల్లోళ్లనాగళ్లని బోలెడు సొమ్మోసి కొన్నాను, ఆటిముంద రీ పట్టానాగళ్లు గిట్టానాగళ్లు పడవు బాబు.

,నారా- ఇంకా యేం చెయ్యవాలి?

రైతు- ఆవెనక సత్తువ సెయ్యాల;

నారా- ఏమిటా సత్తువ?

రైతు- బాబు; వేరేగ చేటి? పసువ్వులు, గొర్రెలు, పందులు, గుర్రాలు, గాడ్దెలు, నరమానవ్వులు, యీటి పెంటలల్లా సత్తువలె.

నారా- ఇన్ని వెకమారేనా?

రైతు- యిన్ని నా? యవసాయానికి తగ్గట్టేదో వ్రగటి, వఁడ్, సె
ఱుకు, పొవ్వాకు, పత్తి, నూలు,యీటికి గొప్పిరా త్తం
మంచిది, పసరాలపెంట అన్నివసాయాలకూ మాంచి
దే, యేరుకో ష్టనక్కో సున్న పెరుపు మాంచిది, కొబ్బరిసె
ట్లకు శాపలపోట్లు మంచిది, యీలాగే బాబు; వ్రగ
టొకటి దానికి వొకటొకటి.

నారా- ప్రతివాళ్లు పెడని పిడకలు పెట్టేసుకొంటారోయ్,
యెందుచేత?

రైతు- ఓను బాబు; కముపు కిక్కోఁగొద్ది, యింకా
గడ్డి గాదర ఆకు అలమ యేసి పసరాలఘుచ్చ పెడలో
కలిపి కుమ్మించి దాన్నంతా లోతుగుమ్ముల్లోయేసి గాలి
యెండా తగలకుండా మద్దెమద్దె పలపలాసగా మన్నేసి
కప్పుతూ గెత్తం లావు సేసుకోవాల గాని, యెక్కన్లేని
పేడా యేరుకొచ్చి పిడకలెట్టేసుగొంటె మతేం యవసా
యంసేస్తాడు? షంసా ర్లందుకే సెడిపోతున్నారు, మం
దా మట్రా ఆపించుగొంటూ బూదేవణే రచ్చించే తల్లి
ని అక్కణ్ణే కిన్పెట్టుకొని తిరిగేఆడిదే పంట, ఆడిదే య
వసాయం, ఆడె రైతు, తక్కినోళ్లు బూతనీ బూమినీ
సెడిపేసి ఆళ్లూ సెడతారు;

నారా- ఏలాంటి భూములు మంచివోయ్?

రైతు- బాబు! యెక్కడికి? రేవటిబూముల్లో సెట్లు బాగా పెరుగుతాయి, పంట తక్కువ, పనివ్వదు, అయితే నేం గాని పట్టిందంటే పదునుకాస్తాది, నేకుంటే బగుళ్లుబగుళ్లే. నవకబూమి పనిస్తాది, పండుంది, గాని మాటిమాటికీ కురావాల. నల్లరేగటిపొలాల్లో పత్తిపంట నావు, పుండి బూము లెట్టిపంట పండుతాయి, బొడువముక్కలుతోటలికి మంచియి, క్షారెబూమికి సదుంగా పదునుండాల, దానికి యెాప్పిండే స్తే మంచిది, యేలాపింటి బూమికైనా పూదిరెట్టిరువేస్తే తుక్కడల పండుతాది, యిసక్కాడి పొలాలకు మురగడమన్నెయ్యాల, బంకకొడిపొలాలకు కిసగెయ్యాల, అప్పటికయి బాగుపడి పాటితేర్తాయి, మన్నెంబూముల్లో గుత్తాలు గాడ్దెలు మందాపిస్తే మన్నెమిరిగి జోరణుగుతాది, సౌడుకల్సిన యిసక్కాడి బూములు గొబ్బరిసెట్లకు మంచియి, యెక్కడికి బాబు! వొకదాని కొకసెరువు, వొకదాని కొకమరువు. యేబూమైనా యెత్తుపల్లాల్లేకుండ సమంసేసి గుల్లగదుక్కదున్ని సత్తువ సారంసేసి పాపటంతోలి మంచియితనాలు జల్లితే సమంగ పండుతాది.

నారా- నీ రుం డొద్దూ?

రైతు- నీరునేందీనా? వొరి సెఱుకు వుల్లి అరటి యీటికి నీరే ఆదరువు, మెట్టుపంటల కం తక్కర్నేదుగాని?

శా, శా.-అయ్యా; చిన్నగారూ; స్నానానికి పోదమా?

గో, చ.- ఇప్పటికే చాలా ప్రొద్దెక్కింది, వేగం, తెమలవాలి పన్రెండుగంటలకే మెయిలుబండి వస్తుందట.

వేం, సో.-శీఘ్రంగా మహారాజుగారికి యీవృత్తాంతం తెలిపితే యేదో పైసంగతికి వారే ప్రయత్నించుకొంటారు.

ప్పే, దీ.- రేపటిదినమే మహారాజులుంగారి దర్శనం, ఇఁక దయ చెయ్యండి. హరహర మహాదేవ.

(అని అందఱు నిష్క్రమింతురు).

ఇది

శ్రీమ దార్యసోమయాజుల

లక్ష్మీనారాయణశాస్త్రి,

లక్ష్మీనరసింహంగార్ల చే

రచియింపఁ బడిన.

కళాశేఖర చరిత్రమునందు

ద్వితీయాంకము.

శ్రీ

# కన్యాశేఖరచరిత్రము.



## తృతీయాంకము

స్థలము, విద్యానగరములోని రాజభవనము

{ అంత గుణసాగర మహారాజును, మంత్రి సుమంత్రుఁడును, ఉపవిష్టులై ప్రవేశించుచున్నారు. }

రాజు- సుమంత! రాజధాని యంతయు చూచివచ్చిన రామ శాస్త్రి మొదలగు వారికి శ్రమయే మిగిలినది గాని చిరంజీవుల జాడయేమో తెలియలేదు. యౌవనము వెదురుమొలకవలె యెదురులేనిది. ఇద్దరు అసహాయశూరులు, అన్నివిద్యలు నేర్చినవారు, చెప్పగానే గ్రహించు శక్తిగలవారు, ప్రజ్ఞావంతులు, సుకుమారులు. దేశములు తిరుగుటవలన ఎన్నికష్టములో తెలియనివారగుటచే ఇట్టి సాహసము చేసిరి. ఇప్పుడన్నియు రైలుమార్గంబు లగుటచే తెలిసికొనుటకు అసాధ్యమైనది. ఎంతటివారికిని ప్రేమ బలమైనదికదా? ఇఁక నేమిచేయవచ్చును?

సుమ- మహారాజ! సప్తవ్యసనములకు లోఁబడనివారలకు ఇతరదేశములనే కాదు ఇతరఖండములనైనను సౌఖ్యమునకు లోపముండదు. శాస్త్రములు తెలిసికొన్నందుకు స్వానుభవముకూడా తోడైనయెడల బంగారమునకు వాసన కలిగినట్లు రాణించును, దేశాటనము చేయని మనుష్యుఁడు నూతిలోని కప్పవలె తానున్నగొందియే లోకమనుకొనుచు, ప్రపంచక మర్మంబుల నెఱుంగక క్రమముగా కొంతకాలమునకు మూఢుండగును. ఇంగ్లండు, జపాను మొదలగు ఇతరఖండములవారి చరిత్రలు ఎఱిఁగినవారగుటచేత ఆయుష్మంతులు ఇట్టి యుద్దేశములు కలిగియుందురు. పూర్వము ఆర్యులు దిగ్విజయమిష చేత యీదేశమునకు వచ్చుట అందఱకు తెలిసిన సంగతే కదా?

రాజు- ఏదీ? ఆర్యుల వృత్తాంతంబును, హిందూదేశమును పరిపాలించిన పూర్వపురాజుల చరిత్రమును, ఆయాకాలములలో వుండే దేశస్థితియును, ఇప్పటి ప్రభువులయొక్క పరిపాలనమును, వినుటకు కోరిక కలుగుచున్నదీ?

సుమ- దేవ ! సంతోషమునకును మనశ్శాంతికిని తగిన చరిత్రమిది. హిమాలయమునకు ఉత్తరభాగంబున మధ్యాసియా అను దేశంబుకలదు. అది ఆర్యులు పుట్టిన చోటు. అక్కడ ఒకేజాతి, ఒక్కటేమతము. కాలక్రమ

మున జనులకు ఆచోటు చాలకుండుటచేత అన్నిదిక్కులకు చెదరిపోయిరి. వారిలోఁగొందఱు ఈ దేశమందు ఉత్తరహిందూస్థానములో ప్రవేశించి అక్కడి ప్రజలను తరిమి తాము నివసించుచుండిరి.

రాజు- హిందువనఁగానేమి?

సుమ- హింస చేయనివాఁడు హిందు వనఁబడుచున్నాఁడు. హిందూదేశ మనఁగా ధర్మదేశమని అర్థము. పూర్వము ఈదేశమందు క్రూరులగు రాక్షసులబాధ మెండగుటచేత ఆర్యు లొక యేర్పాటును చేసికొనిరి.

రాజు- ఏమని?

సుమ- తమలో కొందఱు మంచికర్మలు చేయుచు తమ్మురక్షించువారికి దానిఫలములో నాలవవంతు ఇచ్చుటకును, మఱికొందఱు ఆక్రూరులను శిక్షించి లోకమును సంరక్షించుటకును, ఇంక కొందఱు వ్యవసాయముచేయుచు పశువులను రక్షించుటకును, ఈ దేశపుటనార్యులు ఈమూఁడు తెగలవారికిని నౌకరి చేయుటకును, ఇట్లు. వారలకే వరుసగా బ్రాహ్మణులు, రాజులు, వైశ్యులు, శూద్రులు, అనిపేర్లు ఆరాజులకు సూర్యచంద్రులువంశకర్తలు, సూర్యవంశమునందు మనువు మొదలగువారు అయోధ్యను ముఖ్యపట్నముగాను, చంద్రవంశమునందు పురూరవుఁడు మొదలగువారు హస్తినాపురమును

ముఖ్యపట్నముగాను చేసికొని కంటికి రెప్పవలె మూడు యుగములు ఈ జగమును పరిపాలించిరి. వారల చరిత్రములు పురాణములందు ప్రసిద్ధములై యున్నవి.

రాజు- తరువాత? తరువాత?

సుమ- మహారాజ! ఇప్పుడు పానిపట్టని వాడబడుచున్న స్థలమునకే మునుపు కురుక్షేత్రమనిపేరు. 3000 సంవత్సరములకు పూర్వము అక్కడే మహాభారతయుద్ధము జరిగినది. తరువాత ప్రసిద్ధులగు రాజులు తక్కువగుటచే కాలక్రమమున యీదేశము ఇతరదేశస్థుల వశమైనది. వారిలో మహమ్మదు మతస్థుఁడైన గజినీ అనువాడు అప్పుడప్పుడు గొప్పదండుతో ఆఫ్గనిస్థానము వెడలి హిందూస్థానము ప్రవేశించి సింధు, పంజాబు, గుజరాతి, బొంబాయి, మొదలగు దేశములలోని ధనమును పదిహేడుసార్లు దోచుకొనిపోయెను, ఇట్లే ఒకరివెనుక నొకరుగ యిరవైయాఱుగురు మహమ్మదీయులు ఉత్తర హిందూస్థానములో అయిదువందల సంవత్సరముల వరకూ ప్రజలను చంపుచు, దేవాలయములను పడఁగొట్టుచు, పట్నములను దోచుకొనుచు, గ్రామములను తగులఁబెట్టుచు, స్త్రీలను చెఱఁబట్టుచు, బహుక్రూరముగా యేలిరి.

రాజు- శివశివా, అతిపవిత్రమైన హిందూదేశమునకు ఎంత గ్రహచారము పట్టినది? అట్టి క్రూరులను శిక్షింపఁ గలిగిన వీరుఁడు ఈభరతఖండమందు ఒకఁడైనాపుట్ట లేదా? రావణకంసాదులని పురాణములలో వినుటయే కాని వారికి మించినట్లున్నది వీరి నడత?

సుమ- మహారాజ! శరీరమునకు గొప్పవ్రుండువలె ఎప్పుడొకప్పు డీ ఇట్టిక్రూరులు ఈదేశమును బాధించుటయు, శస్త్రవై ద్యుఁడువలె శ్రీహరి రామకృష్ణాద్యవతారములెత్తి అట్టి యుపద్రవములను చక్కపెట్టుటయు, ప్రసిద్ధమే. ఇఁక మహమ్మదీయులలో షేక్, సయ్యదు, మొగల్, పటా నులని నాలుగు తెగలు గలవు. అందఱు ఈదేశమును ఫ్లలినవారలే, వారిలో మొగలాయీలు రాజ్యపాలన మునందు నిపుణులు, పటానులు బహు దుష్టాత్ములు. అందులో అల్లా, టోగ్లాక్, తైమూరు, అనువారు ప్రత్య క్షరాక్షసులు. రాక్షసులకైనా ఒకానొకకాలమున కని కారముండెడిదని వినికికలదు, కాని వీరియందది సున్న.

రాజు- పాపము. ఈదేశము ఇతరులవశమగుటకు భారతయుద్ధ మే కారణము. ఉత్తమరాజవంశములు అంతటితో అంతరింపఁబట్టి ఇట్టి స్థితి కలిగినది, కాలము విపరీతమై విధి బలీయమైనప్పుడు ఏమిచేయవచ్చును? ఇట్టి చరిత్ర వినుచున్న కొలది తలనొప్పి కలుగుచున్నది.

సుమ- మహారాజ! వీరి తరువాత 15గురు మొగలాయిప్రభువులు 200సం॥లు పరిపాలించిరి. వారిలో బేబరు మొదట ఈదేశమును జయించి ఢిల్లీని తనకు రాజధానిగా చేసికొనెను. ఆయన అతి బలవంతుఁడును, ధైర్యవంతుఁడును; పిమ్మట హుమయూను అధిపతి యాయెను. ఆపిమ్మట భరతఖండముయొక్క పుణ్యసముదాయమో అన్నట్లు ఆయనకు అక్బరుపుట్టి పూర్వపు మహారాజులవలె అనేక గొప్పకార్యములుచేయుచు ప్రజలు పొగడునట్లుగా 49సం॥లు పరిపాలించెను, అప్పుడే;

శ్లో॥ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా
మనోరథాన్ పూరయితుంసమర్థః।
అన్యైర్నృపాలైః పరిదీయమానం
శాఖాయవాస్యా ల్లవణాయవాస్యాత్ ॥

అను ప్రసిద్ధికలిగినది. పిమ్మట సలీం, అనునతఁడు జహాంగీరు, అనఁగా విజయుఁడు అను బిరుదుతో ప్రభువై త్రిలోకసుందరి అను అర్థముగల నూర్జహాన్ అను నామెను పెండ్లాడెను. అప్పుడు సర్టామసురో అను ఆంగ్లేయరాయబారి ఈదేశములో వర్తకముఁజేసికొనుటకు ఆయమవద్ద శలవుపొందెను. ఆ జహాంగీరునకు షాజహాన్ అనునతఁడుపుట్టి జగచ్చంద్రికఅను అర్థమిచ్చు ముంటాజిమహాల్ అనునామెను పెండ్లాడి దేవేంద్ర

భోగము లనుభవింపుచు బహుకాలము గడపెను; అతనే అద్భుతమైన తాజిమహాలును కట్టించెను. రత్నములతోఁ జేయఁబడిన నెమలి సింహాసనము ఆయనదే. అతనికి క్రమముగా దారా, షుజ్యా, మురాదు, ఔరంగజేబు అని నలుగురు కొమారులు పుట్టిరి. వారిలో ఔరంగజేబు అనునతఁడు తోఁబుట్టువులను జయించి తండ్రికి ఖైదుచేసి ఇతరమతములను చెడగొట్టుచు అక్బరు నడతకు విపరీతముగా బహుక్రూరముగా 49సం॥ములు ఏలెను.

రాజు- అయ్యో; నిర్మలమైన చంద్రవంశమునందు వేనుఁడు వోలె అట్టివంశమునందు ఇట్టిక్రూరుఁడు ఎట్లుపుట్టెను? శుద్ధమైన హిందువు లందఱు తుఱకలలోఁ గలిసిరి కాబోలును ?

సుమ- దేవ ! ఉప్పొంగిన సముద్రమునకు చెలియలికట్ట వలె శివాజీ అను మహారాష్ట్రవీరుఁడు అడ్డు పడకుండిన యెడల అట్లే అగుటకు సందేహము లేదు.

రాజు- ఆహా; ఆఖీరోద్ధతుఁడు పరశురాముని స్మరణకుఁ దెచ్చెను; ఆమహారాష్ట్ర వంశస్థులేనా ఈదేశమునేలిరా?

సుమ- పదిమంది మహారాజులు పీష్వా యను సంజ్ఞచే సుమారు రెండునందలసంవత్సరములు ఏకచక్రముగా పరిపాలించిరి. వారిలో బాజీరావు చాల ప్రసిద్ధి కెక్కెను.

రాజు- ఇప్పటి మనప్రభువులగు ఆంగ్లేయులు వర్తకముచేయుటకొఱకు వచ్చినారనుమాట విన వింతగానున్నది, ఏదీ వీరిల చరిత్రము వినుటకు సంతోషముకలుగుచున్నది ?

సుమ- ఎలిజబెత్తనురాణి యింగ్లండును పాలించుసమయమందుఆమెయొద్ద కొలువుపొంది ఆంగ్లేయవర్తకులు మొట్టమొదట 1599 సం॥ మున హిందూదేశమునకు వచ్చి ఈస్టిండియావర్తకసంఘమని పేరుబెట్టుకొని సముద్రతీరముల బొంబాయి, చెన్నపట్నము, కలకత్తా, అను పట్నములను కట్టి వర్తకము చేసికొనుచు వ్యాపించిరి. ఆ కాలములోనే ఫ్రాన్సు, పోర్చుగల్, ఒలాందు, దేశములవారును వర్తకముకొఱకు ఈదేశమునకువచ్చి యొకరితోనొకరు జగడములాడుచు చాలకాలమువరకూ నష్టములుపొందుచుండిరి. ఇట్లుండఁగా దక్షిణహిందూస్థానమునందు డక్కను, తిరుచునాపల్లి, ఆర్కాడు, నవాబులు తమలోతాము కలహములొంది ఫ్రెంచివారి నొకరును, ఇంగ్లీషువారినొకరును సాహాయ్యములుకోరఁగా రాబోవునది మంచికాలముగనుక అందు ఇంగ్లీషువారే జయమొందిరి.

రాజు- ఇంగ్లీషువారి అప్పటిసేనాధిపతిపేరేమి ?

సుమ- రాబర్టుక్లైవు; ఆయన సురాజడౌలా యను బంగాళా

నవాబువద్ద 1756సం॥మున ఆరాజధానినితీసికొని కంపెనీవారిస్వాధీనముచేసెను; ఉత్తరసర్కారులను అంతకు ముందే తీసికొనెను ఆయన యింగ్లీషు ప్రభుత్వమను మేడకు పునాదువంటివాఁడు. అతనివెనుక మైసూరు నవాబైన హైదరాలీ యింగ్లీషువారిని చికాకు పెట్టుచు తుదకురాజీచేసికొనెను మఱికొన్నాళ్లకుటిప్పుసుల్తాను ఇంగ్లీషువారిని యెదిరించెను గాని చివరకు జయము పొందలేక పారిపోవుచు ఒకసిపాయిచేత చంపఁబడెను; ఆంగ్లేయులు క్రమక్రమముగా కలకత్తాను ముఖ్యపట్నముచేసికొని గవర్నర్జనరల్సునుఅక్కడనుంచుచు వర్తకమును రాజ్యమును అభివృద్ధిచేయఁబూనిరి. లార్డు వెల్లస్లీగారు గవర్నర్ జనరల్ గా నుండినపుడు చెన్నరాజధానిని అంతటిని తమస్వాధీనములోనికి తెచ్చిరి. లార్డు హేస్టింగ్సు గారికాలములో బొంబాయిరాజధాని స్వాధీనమయ్యెను. అయోధ్య, మధ్యపరగణాలు, పంజాబు మొదలగు దేశములు లార్డు డాల్ హౌసీగారి పరిపాలనలో ఇంగ్లీషువారి క్రిందఁ జేర్పఁబడెను.

రాజు- ఆహా! దినములు కలిసివచ్చినప్పుడు పట్టినదంతయు బంగారమగుటకు సందేహముండునా? తరువాత? తరువాత?

సుమ- ఈ డాలహౌసీగారు పోస్టాఫీసులు, స్కూళ్లు, రైళ్లు, టెలిగ్రాములు, కాలువలు మొదలగు ఉపయోగమైనపను

లను ఈదేశమునందు వాడుకకుఁదెప్పించి ప్రజలకు అతిసౌఖ్యమును కలిగించిరి.

రాజు- లోకోపకారులు ఎక్కడను లేకపోవుటలేదు. పూర్వము ఇట్టి అద్భుతములను విన్నయైనా యెఱుంగము. గోడ్ల-యేర్పాటుకూడ వీరే చేయించిరా?

సుమ- మనకుపూర్వుఁడగు లార్డు విలియంబెంటింకుగారు.

రాజు- గవర్నరు జనరల్సులో వారెన్నవవారు?

సుమ- పదవవారు.

రాజు- వీరో?

సుమ- పదిహేనవవారు.

రాజు- వీరి పరిపాలనము ఎంతకాలముక్రిందట?

సుమ- ఏభై సంవత్సరములక్రిందట, అప్పటికి సుమారు 250 సం. ములనుండియు తూర్పిండియా వర్తకసంఘమువారికి యున్న అధికారమును ఇంగ్లండు రాణిగారు దీసికొని 1858 సం॥ మున హిందూదేశమునకుఁగూడ రాణి. యాయెను. ఆకంపెనీ రద్దయ్యెను. 1877 సం. రములో శ్రీ విక్టోరియా మహారాణిగారు హిందూదేశపు చక్రవర్తిని అను బిరుదుపొందిరి. దయాదాక్షిణ్యములకు ప్రోవగు ఆయమ ఇంగ్లండులోని జమీందారుని, ఇండియాలోనిమిక్కిలిబీదవానిని, ఒకవిధముగానే చూచుచు, ఇట్టి దొడ్డప్రభుత్వమున్నదూ యెఱుంగమనిదేశీయులు

సంతోషించునట్లుగా నలభైయొక్క సంవత్సరములు ఏకచక్రముగా పరిపాలించిరి.

రాజు- ఆహాహా! ఆసుగుణానిధి పుట్టకమునుపె మనపెద్దలు పురాణముల వ్రాతను ముగించిరి గాని లేకపోయిన ఆమెయే మూలప్రకృతిఅనియు, ఆదిశక్తి అనియు, పరదేవత అనియు, వ్యాసాదులు వర్ణింపకపోరు.

సుమ- దేవ! ఆయమ 1901 సం॥ము జనవరి నెలలో గతించి ప్రజలకు అతిదుఃఖమును కలుగఁజేసిరి, పిమ్మట ఆమె పెద్ద కుమారులును వేల్సు యువరాజుగారును అయిన యెడ్వర్డు సెవెంతు ప్రభువుగారు ఇంగ్లండునకు రాజుగాను, ఇండియాకు చక్రవర్తిగను, అయి పరిపాలించిరి.

రాజు- వీరి పరిపాలన మెట్టిది?

సుమ- వైయేల? యేడవచక్రవర్తి, పదిహేడవమహారాజు. వీరిప్రభుత్వములో లార్డుకర్జనుగారు రాజప్రతినిధిగనుండిరి.

రాజు- వీరేనా మొన్నటి ఢిల్లీదర్బారునకు అధ్యక్షులైరి?

సుమ- ఔను, మహారాజ! పూర్వము ధర్మరాజు రాజసూయాధ్వరమునందువలె ఇప్పుడు అక్కడజరిగిన దర్బారునకు ఇంచుమించుగా రాజు లన్నవా రందఱు వెళ్లిరి.

రాజు- అట్టిసభ కూడినదా?

సుమ- అభ్యంతరమేమి? కర్జనుగారిపిమ్మట రాజప్రతినిధి లార్డు మింటోగారు. వీరు జనులకు అనురాగముకలుగునట్లు పరిపాలించిరి. పూర్వము ఒకప్పుడు సిపాయిలు తమ అధికారులమీఁద తిరుగుబాటుచేసిరి, అప్పుడు జనరల్

హావలస్కి అనునతఁడు దానిని వారించెను. 1910సం॥ము మెనెలలో ఎడ్వర్డు చక్రవర్తిగారు గతించిరి. జార్జి ఫిఫ్తుగారు ప్రస్తుతము ప్రభువులై పరిపాలించుచుండిరి. 1906సం॥ ల్లో వేల్సు యువరాజుగారిగు ఈజార్జి ప్రభువుగారే హిందూదేశమునకు దయచేసియున్నారు. వీరి యిండియా పట్టాభిషేకము ఢిల్లీలోనే 1912సం॥లో జరుగునట ప్రస్తుతము లార్డు హార్డింజి ప్రభువుగారు రాజప్రతినిధి పదవిని పొందిరి.

రాజు- వీరుకూడ పూర్వపు ప్రభువులవలె చల్లగ రాజ్యపాలనము చేయుటకై పరమేశ్వరుఁడు వీరికి ఆయురారోగ్యములను ధర్మబుద్ధిని ప్రసాదించును గాక! సుమంత! ఎంతచక్కని ప్రభుత్వము? సంతోషము సంతోషము. (తెరలో శంఖధ్వని) ఓహో, మధ్యాహ్నముకావచ్చినది?

సుమ- చిత్తము;

రాజు- ఎవరడా అక్కడ? (దౌవారికుఁడు ప్రవేశించి) జయము జయము. దేవరవారికి.

రాజు- చిత్రకా? అంతఃపురమునకు మార్గముచూపుము?

దౌవా- చిత్తము, మహారాజునాజ్ఞ; ఇటు ఇటు మహారాజ; ఇటు ఇటు, (అందఱు నిష్క్రమింతురు.)

ఇది కళాశేఖర చరిత్రమునందు.

తృతీయాంకము;

శ్రీ

# కళాశేఖరచరిత్రము.



## చతుర్థాంకము.

1. స్థలము చెన్నపురి ముత్యాలపేటలోని తంబుసెట్టివీధి.

(అంత సుబుద్ధి ప్రవేశించుచు తనలో) ఆహా! ఈ చెన్నపట్నమును చూడగానే విద్యానగరమును చూచినట్లున్నది? ఇతర దేశములలో నున్నప్పుడు తన దేశముపైని తనదేశములో నున్నప్పుడు తనగ్రామము పైని ప్రేమ అధికముగదా? నావయస్యుఁడు కళాశేఖరుఁడు ఇప్పటికైనా దేశానకు రాకుండునా? (పరిక్రమించి చూచి) ఓహో, ఇది ముత్యాలపేటలోని తంబుసెట్టి వీధి, ఇదె యెదురుగా హైకోర్టు, ఆహా, ఎంతచిత్రమైన కట్టడము! సావకాశముగా మధ్యాహ్న మీ హైకోర్టును చూడవచ్చును. ఇప్పుడే వీధిలోని వింతలను కొన్నిటిని చూచెదనుగాక; (ఇంచుక పరిక్రమించి) ఓహో; ఏమినాపుణ్యము ? ఇక్కడ 'విద్యావతీ ఆఫీసు' అని పలక కట్టియున్నది. లోనికివెళ్లి గ్రంథకర్తగారిని చూచి. విషయములను తెలిసికొనెదనుగాక.

(అనిలోనికి పరిక్రమించును)

2-స్థలము, విద్యావతీ ఆఫీసు.

{ అంత దొరసామయ్యగారును, లక్ష్మినారాయణ శాస్త్రి గారును, యథోచితాసనంబుల నుపవిష్టులై యుందురు. }

లక్ష్మి-మిత్రమా! చరక మూలికాప్రయోగ రత్నావళిని రెండవ పర్యాయము అచ్చువేయించినారా?

దొర- ఆర్య; పూర్తియైనది, మొన్ననే;

లక్ష్మి- గృహవైద్యము మొదలగునవి అందులో నున్నవా?

దొర- పూర్తిగా నున్నవి. ఇందు వైద్యశాస్త్రములలోని రహస్యములన్నియు కలవు అనేక గ్రంథములను జదివియు తెలియని వైద్యరహస్యము లిందు సులభముగా తెలిసికొన వచ్చును ఇంతికును ఒక ముఖ్యవిశేష యమున్నది.

లక్ష్మి- ఏమిటా విషయము? (అంతసుబుద్ధి ప్రవేశించుచున్నాడు)

సుబు-ఏమిఆశ్చర్యము; నానయస్యుడు కళాశేఖరుడా యేమి? (నిదానించి చూచి) కాదు కాదు భ్రమపడితిని, (ఇంచుక పరిక్రమించి) ఓహో నా ప్రియమిత్రుడు లక్ష్మి నారాయణశాస్త్రి, ఇత డిక్కడ నుండుట కారణ మేమి? విద్యావతీ యెడిటరు ఇతడైయుండునా? తెలిసికొని యెదగాక,(సమీపించి) మిత్రమా! కుశలమా?

లక్ష్మి- ఓహో, నా ప్రియ మిత్రుడు సుబుద్ధి; ఏమి యీ

సుదినము? మిత్త్రమా; దయచేయుము, దయచేయుము.
(అనిశుర్చీపై కూర్చుండఁబెట్టును).

దొర- ఆర్య! మీరు మీా గ్రామ స్థులా?

లక్ష్మీ- ఔను నాప్రాణమే; సంవత్సరము క్రిందట వీరును, మా యువరాజుగారైన కళాశేఖర ప్రభువుగారును, దేశాటనము చేయుటకై బయలుదేరినారు, నా పుణ్య వశముచేత ఈవేళ వీరి దర్శనమైనది.

దొర- (సుబుద్ధివంకఁజూచి) మా మిత్త్రులకు మిత్త్రులగుటచే మీారును నాకు మిత్త్రులే.

సుబు- సందేహమేమి?

లక్ష్మీ- (సుబుద్ధితో)మిత్త్రమా! వీరు విద్యావతీ ప్రొప్రైటరు గారు, ఇంటిపేరు వైద్యమువారు, పేరు దొరసామయ్య గారు, నాకు ముఖ్యమిత్త్రులు, ఇట్టి యోగ్యులు పరో పకార బుద్ధిగలవారు అన్ని విద్యల సారములు గ్రహిం చినవారు స్నేహపాత్రులు అరుదు.

సుబు- మిత్త్రమా! వీరిఖ్యాతిని వినుటయేకాదు వీరు తెనిగించి నవియు, రచించినవియు నగు హఠయోగదీపిక, విచార సాగరము, సకలార్థసాగరము, రాజయోగ రత్నాకర ము, మొదలగు గ్రంథములను చూచి పరమానంద భ రితుఁడనై తిని.

దొర- తమవంటి మహనీయుల ఆశీః ప్రభావము; మైత్రీ ధర్మముచే అట్లు సెలవిచ్చుచుంటిరి గాని అల్పజ్ఞుని విషయమై అంతయేల?

సుబు- అట్లుకాదు, మీ గ్రంథములను చూచిన వివేకులు వేయినోట్ల పొగడకపోరు.

లక్ష్మీ- ఇఁక ప్రకృతము సెలవిచ్చెదరా?

దొర- మంచిది, దేవుడు భూమి నీరు అగ్ని గాలి ఆకాశము అను ఐదు భూతములను జగత్తునకు ఆధారముగాఁజేసి ఆవిధముననే జీవునకును ఈ ఐదుభూతములనే ఆధారముగఁ జేసియున్నాఁడు.

లక్ష్మీ- అదెట్లు?

దొర- ఎముకలు మాంసము చర్మము నరములు రోమములు ఇవి భూమితత్వము, రక్తము శుక్లము మూత్రము చెమట చొంగ ఇవి నీటితత్వము, చూచుట చలించుట దుఃఖించుట అరిగించుట మండుట ఇవి అగ్నితత్వము, నడచుట పరుగెత్తుట దాటుట పడుట కూర్చుండుట ఇవి గాలితత్వము, మోహముభయము లజ్జ ద్వేషము, రాగము ఇవి ఆకాశతత్వము.

లక్ష్మీ- ఇట్లు అమర్చబడిన దేహమునకు గాలి నీరు ఆహారము ఇవి కావలసినంత క్రమప్రకారం తగిన కాలములందు

ఇప్పించకపోయినప్పుడు ఐదుభూతములుచేయు పను
లు ఒక్కొక్కప్పుడు జరుగవు కాబోలును?

దొర- ఔను, గాలి ప్రతిచోట ఉన్నప్పటికిని బొగ్గు నీరు ఉప్పు మొదలగు వస్తువులుగల చోట్లనుంచి వచ్చు గాలి మాత్రం సుఖమును ఇచ్చును; ఆకులు అలమలు కుప్ప శ్మశానము మురికిసీళ్లు జలదారి మలమూత్రములు విడిచిన స్థలములు రోగులుండు చోట్లు ఇట్టి తావులనుంచి వచ్చుగాలి రోగములను కలిగించును. చింతచెట్లు మొదలైన ఉష్ణముగల చెట్లగాలి చెడ్డది. మఱ్ఱి వేప మొదలగు చల్లని చెట్లగాలిమంచిది. ఏచెట్ల వద్దగాని రాత్రి పూట ఉండకూడదు. రోగులవద్దనుండే కంపుగాలిని పోగొట్టవలెనంటే గంపలో కొంత పొయిబొగ్గును వేసి ఒకమూల నుంచవలెను. లేనియెడల నిప్పుమీద గంధకం వేసి ఆపొగ తగులునట్లు చేయవలెను. సాంబ్రాణి గుగ్గిలం మొదలగు పొగలవలన విషపుగాలి పోదు. వాయువే శరీరమును కాపాడుచున్నది. కాబట్టి గాలికి ప్రాణమని మన పూర్వులు పేరుబెట్టిరి.

లక్ష్మి- స్త్రీలుగాని పిల్లలుగాని గాలియందు తిరుగుట తప్పా?

దొర- కాదు.

లక్ష్మి- ఐతే మనదేశంలో గర్భిణీ స్త్రీలకు రోగులకు గాలిని తగులనీయ రేమి?

దొర- వీరికి గాలి ముఖ్యముగా కావలెను.

సుబు- సముద్రపుగాలి యెట్టిది?

దొర- అది ప్రతివారికిని మంచిది. ఐనప్పటికి ఉష్ణభూమి చేరువనుండు సముద్రపుగాలి మంచి ఆరోగ్యకరమైనది, శీతలభూమి చేరువనుండు సముద్రపుగాలి రక్తక్షీణము చేయును, వాతసంబాధభూమి చేరువనుండు సముద్రపుగాలి అండవాతము శ్లీపదము మొదలైన రోగములను కలుగఁజేయును. పట్నవాసములోని జనులకు విశేషముగా గాలి కావలెను. పెక్కుమందిలో చేరియుండకూడదు. చిన్నగదిలో అనేకులు చేరి కొన్ని నిమిషము లుండవచ్చును గాని, 2-3 గంట లుండుట అనారోగ్యము. కొన్ని సమయములలో మరణముకూడ కలుగును.

లక్ష్మి- భోజనం లేకుండా కొన్ని దినాలున్నప్పటికి నీరులేనిది 1-2 దినములు తప్ప అధికముగా ఉండలేము, ఈ లోకములో అన్ని ప్రాణులును చెట్లు మొదలగునవియును నీరులేనిది బ్రతుకవుకదా?

దొర- కనుకనే నీటికి జీవనమని పేరు కలిగినది. సముద్రపునీరే ఆవిరై వానగా కురియును. చవిటినేలనుండు నీరు ఉప్పుగాను రేగటి నేలనుండు నీరు తీపిగాను ఉండును. గొప్పనదులలోను గుంటలలోను మడుగులలోను బావుల

లోను నీళ్లు చాలాదినములుండును. ఆ నీళ్లను జాగ్ర
తగా వాడుకొనవలెను. అధికముగా నీళ్లున్నప్పుడు
కంపు తెలియదు. ఆకులు అలమలు చెట్లవేళ్లు గడ్డి పాచి
మొదలగునవి కుళ్లిననీరు త్రాగుటవలన అనేక రోగ
ములుకలుగును. కనుక ఈనీళ్లు స్నానపానములకు
పనికి రావు.

సుబు- పిల్లలుమొదలు ముసలివారివరకు స్త్రీపురుషుల కంద
ఱకూ దినాని కొకమారైనను స్నానం కావలసినదే
కదా? ఒకానొకప్పుడు లేనిచో తప్పేమి?

దొర- లేనియెడల చెమట బాగా పైకిరాక రోగములను కలి
గించును. బలములేనివారు రోగులు బాలురు వీరికి గో
రువెచ్చని నీళ్లు స్నానమునకు మంచివి. చలికాలమందు
అందఱకు గోరువెచ్చని నీళ్లు మంచివే. మిక్కిలి వేడి
నీళ్లు స్నానమునకు మంచివికావు. దెబ్బతగిలినవారు
త్రోవనడచినవారు కొంత వేడిగా పోసికొనవచ్చును.
పసిబాలురకు మనదేశమువారు ఊపిరికూడా తిరుగనీ
యక మిక్కిలి వేడినీళ్లను వడివడిగా పోసెదరు. దీని
వలన కొన్ని సమయములందు పిల్లలు చనిపోవలసి
వచ్చును. బిడ్డలకు సాధారణముగా ఊపిరి తిరుగునట్లు
వెచ్చని నీళ్లను మెల్లమెల్లగా పోయవలెను. అధికమైన
వేడినీళ్లు ఊపిరిని బంధించును.

లక్ష్మీ- కొన్ని కాలములలో నీళ్లు మంచివిగా దొరకవు, అప్పు డేమిగతి?

దొర- అట్టిసమయములో నీళ్లయందు పటికారము మామిడి పప్పు గంధకము ఇండుగు పీటిలో దేనిచేనైనను తేర నిచ్చి వడియఁగట్టి వాడుకొనవలెను. కట్టెలబొగ్గును ఇసుకను శుద్ధిపఱచిన కుండలోవేసి అందు నీళ్లుపోసి క్రిందికుండకు దిగజారిన ఆ మంచినీళ్లను వాడుట ఆరో గ్యము. కొన్నిరోజుల కొకమారు క్రొత్తబొగ్గును ఇసు కను వేయుచుండవలెను. వంటకుకూడా మంచినీళ్లుగానే యుండవలెను.

సుబ- గాలి నీరు వున్నప్పటికిని అన్నం లేనియెడల చాల కాలము వుండలేముకదా? కనుక యిఁక భోజనపు విష యమై శెలవీయవలెను.

దొర- భోజనమే మనకు బలమిచ్చుచున్నదని అధికముగా తిన కూడదు. బాలురకుఁగాని పెద్దలకుఁగాని తిండిని నియమంచొప్పునఁ పెట్టవలెను. బాలురకు దినమునకు మూడుమార్లు కొద్దికాలములో పెట్టవచ్చును. ఐనను ఒకొ్కకజామునకుపైగా భోజనం పెట్టవలెను. పది యాఱేండ్లకు మించినవారికి ఉదయకాలమందు జాము నకు పైగా 10 గంటలలోపల నొకపూటయును రాత్రి 7, 8 గంటలలోపల నొకపూటయును భోజనము

పెట్టవలెను. కొంచెము దేహబలము తగ్గిన వారికిని రోగులు మొదలైన వారికిని మధ్యాహ్నకాలమునగూడ భోజనము పెట్టించవచ్చును. ఈ భోజనమందు సత్తువ గల పదార్థములనే యెల్లప్పుడు తినవలసినది.

సుబ- అట్టివస్తువులే మనముతింటే అరిగించుకొనే శక్తిలేక అజీర్ణాది రోగములుపొంది బాధపడుదుమే? అప్పుడో?

దొర- కనుకనే ఉప్పు పులుసు కారము మొదలైన అనేక సంబారువస్తువులను చేర్చుకొనుచున్నాము. కూడినంత వరకు మిక్కిలి బలమైనవస్తువులనే తినవలెను. భోజనము అర్థభాగముగాను నీళ్లు పాతిక భాగముగాను భోజనము చేయవలెను. తక్కిన పాతికభాగము నిండించక యుంచినయెడల రోగము రాదని మన పూర్వులు చెప్పియున్నారు. భోజనమును బాగుగా నమలక నోటిలోనికి పోయిన మాత్రమున మింగకూడదు.

సుబ- చంటి పాపలకు పాలిచ్చుటకు కాలము యేర్పాటు చేయవచ్చునా?

దొర- కూడదు.

సుబ- రెండు మూడు సంవత్సరముల పిల్లలకు పప్పు మొదలగు వస్తువులను విశేషముగా యివ్వవచ్చునా?

దొర- కూడదు. అది కొన్నిసమయములందు జీర్ణము కాక శరీరతాపమును కలిగించును. బాలురు తినుట లేదని

కొందఱు కారము,ఉప్పు మొదలైనవి చేర్పక అన్నము పెట్టుదురు. లేక పాలు మాత్రము త్రాగింతురు. అట్లు చేయుట తగదు. మఱియును చిరుతిండ్లను విశేషము గా యివ్వకూడదు. బాలురు భోజనం చేయనిసమయం లో గావగాని పాలుగాని పోయుదురు కదా ? వారు పోయునప్పుడు శిశువులకు ఊపిరి తిరుగనట్లు పోయుట వలన చచ్చుటకూడ ఒకానొక సమయమున కలుగును.

లక్ష్మి- నిద్ర ఆహారములు సమానమందురు. ఆహారముకంటె నిద్ర ముఖ్యమని నాతలంపు. మీయభిప్రాయ మేమి?

దార- నిద్ర లేకుంటే సమస్త సుఖములు పోవును నిద్రను కోరువారందఱు దేహవిశ్రాంతిని ముందుగాకోరిపిమ్మట నిద్రను కోరవలెను. లేనియెడల విశేషముగా నిద్ర పట్టక కలవరింతలచేత కాలము గడుపవలసివచ్చును. ప్రతిదినము కొంచెముసేపు తిరుగు లాడుట సాము చేయుట గుఱ్ఱపుసవారు చేయుట లేక యేదైన పనులు చేయుట మొదలగు వానిని చేయవలెను.ఇట్లు చేయని యెడల దేహమునకు బలముకలుగక బుద్ధి స్థిరత్వము తప్పి చంచలముతో యేమియు తోచక తలచిన కార్యములన్నియు చెడిపోవును.

లక్ష్మి- దేహపరిశ్రమ లేకపోవుట వలన శుద్ధమైన రక్తము పారకుండుట చెమటపట్టకపోవుట శుద్ధమైనగాలి లోప

లకు వెళ్లకపోవుట తిన్న అన్నము అరుగకపోవుట కలుగును కాబోలును?

దొర- తప్పక కలుగును.

సుబు- పిల్లలకు స్త్రీలకు పరిశ్రమ యెక్కడిది?

దొర- పిల్లలుకూడ వారివారికి తగినంత ఆటపాటలతో కాలము గడపుట మంచిదే. స్త్రీలు ఇంటిపనులు చేయుటయందు కష్టపడుటయే వారియొక్క దేహ విశ్రాంతికి కావలసినంత సుఖమిచ్చును.

లక్ష్మి- మంచి నిద్ర వచ్చుటకు మార్గమేది?

దొర- పగటి పూటకంటె రాత్రిపూట తక్కువ ఆహారమును తినుట.

లక్ష్మి- నిద్ర లేనియెడల దోషమేమి?

దొర- మెదడునకు చెరుపు కలుగును.

లక్ష్మి- పగలు నిద్రింపరాదా?

దొర- ఎండకాలమున కూడును.

లక్ష్మి- నిద్రకు చెరుపెట్లు కలుగును?

దొర- పడకటింటికి గాలి రాకపోవుట బట్టలు శుభ్రముగా లేకుండుట అనేకులు కలిసి పండుకొనుట ఈ మొదలైన వాటివలన చెరుపు కలుగును.

సుబు- ఏ వయస్సున యెంతకాలము నిద్ర పోవచ్చును?

దొర- పిల్లలకు నిద్ర మెండుగా కావలయును గనుక వారు పగటియందుకూడ నిద్ర పోవచ్చును. 6,7సం॥ లువయ స్సువరకు పిల్లలకు 12 గంటల కాలము నిద్రకావలెను. ఆ పైని 18 సం॥ ల వరకు దినమునకు 9 గంటలసేపు నిద్రకావలెను. పెద్దవారు రాత్రి 10 గంటలకు పరుండి తెల్లవారుజామున 5 గంటలకు లేచిన యెడల సుఖ దేహులగుదురు. నిద్ర పోవునపుడు ముఖమును మూసి కొనకూడదు. అందఱును తగినంత పరిశ్రమ చేసినళ్లైన సుఖమైన గాఢనిద్ర కలిగి ఆరోగ్యమును పొందుదురు.

లక్ష్మి- ఎట్టి యిండ్లు కాపురమునకు తగినవి ?

దొర- మన మెట్టి సంపద కలిగియున్నను కాపురముండుటకు వసతైన యిండ్లు లేకున్నయెడల అన్నివిధములచేతను సుఖమునకు చెరుపుకలుగును. కాబట్టి చుట్టుపట్ల నీరు నిలువని స్థలములో యిండ్లు కట్టవలెను. గాలి వచ్చు టకుకావలసిన కిటికీలను ఉంచవలెను. ఇండ్లు దొక్కటముగా నుండుచోట్ల కట్టుటకంటె చుట్టును కాళీయున్న స్థలములో కట్టుట ఆరోగ్యమునకు మంచిది. వెలుతురు లేని యింటిలో కాపురమున్న జనులకు బలము తక్కువై పోవుట దేహము తెల్లబాఱిపోవుట కలుగును.

లక్ష్మి- ఇంటిని యెట్లు శుభ్రపఱచుచుండవలెను?

దొర- ప్రతిదినముచు చక్కగా కడుగుచుండవలెను. 6 నెలల కొకమారైనను గోడలకు సున్నమును కొట్టవలెను. అంట్లకుండలు ముఱికికాల్వలు బాగుచేయుచుండవలెను.

లక్ష్మి- గ్రామాదులలో ముంగిటియందే పశువులు మొదలగు వానిని కట్టుచుందురే, అది తప్పుకాదా?

దొర- ఆహా, అట్లు కట్టుటవలన పశువులయొక్క ఊపిరి ఎంత మాత్రము వెలుపలికి పోక మనుష్యులు పీల్చుగాలితో కలిసి లోపలకుపోవును. అందుచే బలక్షీణము కలుగును. మఱియు వీని మూత్రముపేడ గడ్డి మొదలగు వాటినుండి వచ్చు కంపుగాలివల్ల వాంతిభేది అతిసారము గ్రహణి మొదలగు రోగములు కలుగును. ఇండ్లయందు అసహ్యకరమైన వస్తువులను, నలుగురు చూచి నవ్వునట్టి వస్తువులను, ఉంచకుండినయెడల సుఖదేహులై కొంతకాలమువఱకు చక్కనిస్థితిలోనుందురు.

సుబు- టీకాలు పొడుచుటవలన లాభమేమి?

దొర- మశూచికము రాకుండుటకు.

సుబు- మశూచికమనఁగా నేమి?

దొర- ప్రస్తుతము మశూచికమనఁగా; ఆవులవంటి జంతువుల పొదుగులందు కొన్ని సమయములలో కలుగుచున్న మశూచికము అనే వ్యాధినుంచి తీసినపాలను మనుష్యుల

భుజములందు పొడుచుట. దానికే టీకాలువేయుట అనిపేరు.

సుబు- ఆసంగతిని ఎప్పుడు ఎవరు కనిపెట్టిరి?

దొర- దానిని 1798 సం॥ము నందు పశువులు మశూచికము అనే వ్యాధివలన బాధపడునప్పుడు ఆవ్యాధి సంపర్కముగలవారికి రాకుండునట్లు డాక్టర్ జన్నర్ దొరగారు మొదట తెలిసికొనెను.

సుబు- దీనివిషయము మరేమైనకలదా?

దొర- ఈకార్యము సర్కారువారి అనుమతిని పొందినవారి వలనజరిపింపఁబడుచుండినను ప్రతివారికిని ఈవిషయము తెలియుట ముఖ్యము; కనుక సంగ్రహింపఁబడినది.

సుబు- నేడెంత మంచిదినమండి? ఆరోగ్యమర్మములు తెలిసినవి.

లక్ష్మి- ధన్యులమైతిమి.

దొర- మిత్రమా! మన మీ మాటలలోనుండి ఆర్యుని చరిత్రమే వినుటలేదు.

సుబు- ఆహా, వినవచ్చును.

దొర- సంగ్రహముగా సారాంశమును శెలవీయవలెను.

సుబు- నేనును నానయస్యుఁడును బెజవాడవద్ద విడివడితిమి. ఆయన బందరుమీఁదుగా సముద్రయానము చేయ దలంచెను. నన్ను నాటునప్రయాణము చేయు మనుటచే

మిత్రుని యాజ్ఞకు కట్టువడి మొట్టమొదట హైదరాబాదునకు వెళ్లితిని. అదిస్వతంత్ర రాజ్యము. పిమ్మట వింధ్యాటవి మార్గమునబోయి మహారాష్ట్ర దేశమును చూచి నర్మదా తపతీ నదులనుదాటి బొంబాయి చేరితిని. అది మిక్కిలి సొగసైన పట్నము. గవర్నమెంటువారి ఇండియాఅనుకోటకు అది మొగసాల. పిమ్మట సింధునది పారు ప్రదేశములనూ, పంజాబును, కాశ్మీరమును, చూచి క్రమముగా అయోధ్య, రాజపుత్ర స్థానము గని, ఢిల్లీకి వచ్చితిని. పిమ్మట ప్రాచీన క్షేత్రములగు కాశీ గయా ప్రయాగము లను సేవించి కలకత్తాకు వచ్చితిని అదిరాజప్రతినిధి యుండుచోటు. దానిని మించినజనులు, మేడలు, గల పట్నము ఈదెశమున లేదు. వెనుక బర్మాదేశమునుకంటిని. అక్కడ తెల్లయేనుగులు కలవు. ఆవల జవామవెళ్లినాడను.అక్కడిజనులు మిగుల తెలివితేటలు గలవారు. అందఱు ప్రభుభక్తిపరాయణులు. పిమ్మట క్రమంబుగా ఈ చెన్నపురికివచ్చి బాల్యస్నేహితులగు శాస్త్రిగారిని, నూతన మిత్రులగు మిమ్మును గని పరమానంద భరితుఁడనైతిని. ఆర్యా! ఇదే సంగ్రహము

దౌర- చాలసంతోషము.మిత్రిమా;( తెరలోకలకలము.అందఱు వినుచున్నారు. అంత బ్రాహ్మణుఁడును, సాహుకారియు,ప్రవేశింతురు.)

బ్రాహ్మ-అయ్యా; నన్నీ షాహుకారు లెక్కల్లో చిక్కు పెడుతున్నాఁడు. మీరు న్యాయం చెప్పవలెను.

దొర- ఏమో చెప్పండి?

షాహు-తులం 1 కి, (రుం-1-6 ల) చొప్పున 2 సేర్ల ంగువ, డజను 1కి, (రు 0-2-8ల) చొ॥ 6గ్రోసుల పెన్సళ్లు, వీటికైన సొమ్మెంతో చెప్పండి?

దొర- దీనికేమున్నదండీ?ఏ పద్దునకా పద్దు వేరుచేస్తే స్పష్ట మవుతుంది. (ఆలోచించి) రు 14-4-0లు.

షాహు-సామీ; నే నేం చిక్కుపెట్టెనో అడగండి?

బ్రాహ్మ-లేదు, నేనే పొరబడ్డాను. ఇదిగో సొమ్ము (అని యిచ్చి నిష్క్రమించును).

షాహు-(పోనుండఁగా పిల్లవాఁడొకఁడు ప్రవేశించును).

షాహు-ఏమి నాయనా; ఇక్కడికొచ్చేవు?

పిల్ల- ఇనస్పెక్టరుగారు యివాళ మాబడి పరీక్ష చేస్తారఁట.

షాహు-అయితే యిక్కడికేల వచ్చేవు?

పిల్ల- నాకు కోటు షరాయి టోపీ కావాలి.

సుబు- సాహుకారు; నీ కుమారుఁడా?

సాహు-అవును సామి.

సుబు- వీని పేరు?

సాహు-సుబ్బయ్య. అయ్యా శలవు.

అందఱు-మంచిది, మంచిది.

సాహు-(కొముకుతో) రా,నాయనా; (అని నిష్క్రమించును,
లక్ష్మి-మిత్రమా: లోకచిత్రము లేమైన కనిపెట్టితివా?
సుబు-ఈ ప్రపంచమే మొదటిచిత్రము, మిత్రమా! మేకవన్నె పులులుకొన్ని; పులివన్నె మేకలుకొన్ని. ఈ కాలమున ఆకారపుష్టి, డాంబికము, నోటిబూకరము, ముఖ్యము. పారమార్థికచింతఎక్కడనో.మినుకుమినుకు మనుచున్నది. ముపిడిపండును జూచి మోహపడుట పనసపండును జూచి భయపడుట ఆహా; వికసించిన మల్లెలు మేము గ్రహించెదమనియు, మొగలి రేను ధరించెద ననియు, పద్మము రేను వరించెదననియు, ఎదురు చూచుచుండ పాండిత్యసంపదగల చంచరీకమునకు చెవితుదలచే పా అందోలుచున్న మదపుటేనుగు దానముతో నేమిపని? భూమి విస్తారమైనది. కాలము మేరలేనిది. ఔదార్య మును అట్టిదే. కోకిలధ్వని యెంతమధురమో అంత అ రుదు. ఇది యేలోకరహస్యము. ఇంతకంటె చిత్రమేది?

(తెరలో ఫిరంగి ధ్వని)

దొర-ఓహో 12 గంటలు అయినది ఇక బసలకు పోదమా?
లక్ష్మి: సుబు-మంచిది, మంచిది. (అందఱు నిష్క్రమింతురు).

ఇది కళాశేఖర చరిత్రమునందు.

చతుర్థాంకము.

శ్రీ

# కన్యాశుల్క రచరత్రము.



## పంచమాంకము.

స్థలము-ప్రైమరీపాఠశాల.

(అంత స్కూలుమాస్టరును, నాల్గవ తరగతి పిల్లలును ప్రవేశింతురు.)

మాస్ట-ఇఁక సూర్యకుటుంబాన్ని గురించి చెప్తాను, జాగ్రతగా వినండి.

పిల్లలు-చిత్తం, చిత్తం.

మాస్ట-సూర్యునిచుట్టూ భూమి మొదలగు గ్రహాములు తిరుగుచున్నవి. 16 వ శతాబ్దమునందు కోపర్నికస్ అనునతఁడు ఇట్లు కనిపెట్టెను.

పిల్లడు-సూర్యుఁడు గ్రహమా?

మాస్ట-మనదేశపు శాస్త్రములు సూర్యుఁడు గ్రహం అని చెప్తూచున్నాయి. వేదములు సూర్యుఁడేపరబ్రహ్మమని చాటుచున్నవి. సూర్యుఁడు మండుచున్న గొప్ప మంటప్రోగుగాని గ్రహం కాదనియు, గ్రహములు అతని

కుటుంబము లనియు, ఇతరుల అభిప్రాయము.

పిల్ల- సూర్యబింబం భూమికంటె పెద్దా? చిన్నా?

మాస్ట- సూర్యబింబము భూగోళముకంటె 10 లక్షల రెట్లు పెద్దది.

పిల్ల- సూర్యుఁ డిక్కడికి యెంతదూరమం దున్నాఁ డండి?

మాస్ట- సుమారు 9 కోట్ల 30 లక్షల మైళ్ల దూరమందు.

పిల్ల- గ్రహాము లెన్నండి?

మాస్ట- సుమారు 300, కనిపెట్టబడినవి అందులో ముఖ్యమైనవి యెనిమిది

పిల్ల- అవే వండి?

మాస్ట- బుధుఁడు, శుక్రుఁడు, భూమి, అంగారకుఁడు, బృహస్పతి, శని, యూరెనస్. నెప్ట్యూన్, అనునవి

పిల్ల- గ్రహా మనఁగా నేమిటండి?

మాస్ట- సూర్యునిచుట్టూ తిరిగేవి గ్రహాలు, వాటిచుట్టూ తిరిగేవి ఉపగ్రహాలు, ఆ ఉపగ్రహాలకే చంద్రు లంటారు.

పిల్ల- అయితే యీ భూమిఁ తిరుగుతూందా?

మాస్ట- ఆహా; భూమి తనలోతాను తిరుగుచు సూర్యునిచుట్టూ తిరుగు తూంది.

పిల్ల- తిరుగుతూన్నట్లు మనకిడకనపడడం లేదేమండి?

మాస్ట- మనకి కనపడనంత వేగంగా తిరుగుతూంది .

పిల్ల- ఆలాగు తిరగడంవల్ల లాభ మేమిటండి ?

మాష్ట- అందువల్ల దినములు, ఋతువులు, కాలములు, సంవత్సరములు, మారి పంటలు పండుచుండును.

పిల్ల- ఎంతకాలానికి భూమి సూర్యునిచుట్టూ తిరిగివస్తుందండి?

మాష్ట- 1 సంవత్సరానికి సూర్యునిచుట్టూన్ను, 1దినానికి తనలో తానున్ను, తిరుగును

పిల్ల- నెల లేమిటండి?

మాష్ట- భూమికి వుపగ్రహంగావుండే చంద్రుడు భూమిచుట్టూ వొక్క మారు తిరిగివచ్చు కాలానికి నెల అనిపేరు

పిల్ల- చంద్రుడిక్కడికి యెంతదూరమందున్నాడండి ?

మాష్ట- 2 లక్షల 50 వేల మైళ్ళ దూరమందున్నాడు. ఆ మండలము భూమికంటె 50 రెట్లు చిన్నది.

పిల్ల- తక్కిన గ్రహాలనుగురించి చెప్పండి ?

మాష్ట- బుధుడు సూర్యునికి అతిదగ్గర అందుచేత సూర్యుని చుట్టి వచ్చుటకు 4 నెలలే అవుతుంది. అది భూమికంటె 17 రెట్లు చిన్నది.

పిల్ల- శుక్రుడో ?

మాష్ట- భూమికి అతిదగ్గర అందుచేతనే అంత కాంతి.

పిల్ల- అంగారకుడు భూమికంటె చిన్నా? పెద్దా?

మాష్ట- ఎనిమిదిరెట్లు చిన్న. బృహస్పతి భూమికంటె వేయిరెట్లు

పెద్ద. తరువాత శనిగ్రహం. యూరేనెస్సు భూమికంటె 70 రెట్లున్ను, నెప్ట్యూన్ 100 రెట్లున్ను పెద్దవి. ఈ నెప్ట్యూన్ అను గ్రహము సూర్యునికి అతిదూరంగా వుండడంచేత సూర్యునిచుట్టి వొకసారి తిరుగుటకు 165 సం॥ లు అవును.

పిల్ల- గ్రహణవుఁ లేవిఁటండి?

శాస్త్రి- సూర్యునిచుట్టు భూమిన్ని, భూమిచుట్టు చంద్రుడున్ను, తిరుగుచున్నప్పుడు ఆ మూడున్ను వొకటే సరళ రేఖ పైకిరాగా, అప్పుడు గ్రహణముపట్టును. సూర్యునకు చంద్రునకు నడుమ భూమి వున్నప్పుడు భూమి నీడ చంద్రున కడ్డముకాగా దానికే చంద్రగ్రహణమని పేరు. సూర్యునకు భూమికి నడుమ చంద్రుఁడు వున్నప్పుడు చంద్రునినీడ సూర్యునకు అడ్డముకాగా దానికే సూర్య గ్రహణమని పేరు.

పిల్ల- రాహు కేతువులు సూర్యచంద్రులను పట్టుకొంటే గ్రహణం పట్టుతుం దంటారే, యిదేవిఁటిది?

శాస్త్రి- ఆ రాహు కేతువులు ఛాయాగ్రహములని వాడుక. ఛాయ అనగా నీడ, నేనుచెప్పినదే నిజముకావచ్చును. ఎట్లైనను ఆసమయము స్నానము, దానము, ధర్మము, మంత్ర జపము, మొదలైనవి చేయుటకు చాలమంచిది.

పిల్ల- తోకచుక్క లేవిఁటండి?

మాస్ట-వాటికే మనపెద్దలు ధూమకేతువులని పేరు పెట్టినారు. అవి సుమారు 2-3 వందల రకా లున్నాయఁట. కొన్నిటికి తోకలు అగ్నివలెను, మఱికొన్నిటికి పొగ వలెను, కొన్నిటికి పొట్టిగాను, కొన్నిటికి పొడుగుగాను, కొన్నిటికి లేకుండను, వుండునఁట.

పిల్ల- ఏప్పుడెప్పుడు అవివచ్చుచుండునండి?

మాస్ట-3 ఏండ్లకుకొన్ని, 13 ఏండ్లకుకొన్ని, 33 ఏండ్లకుకొన్ని 50 ఏండ్లకుకొన్ని, కనిపించుచుండునఁట.

పిల్ల- మొన్నకనిపించిన చుక్క కేవిఁటండి అంత తోకవుంది?

మాస్ట-దానినే హాలేధూమకేతు వంటారు, 2 వందలేండ్లకు మునుపు హాలే అనుదొరకనిపెట్టి ఈ చుక్క సూర్యుని చుట్టు తిరిగి వచ్చుటలో 75 సం॥ లకు వొకమారు కని పించునని సిద్ధాంతము చేసెనఁట. అదికూడ అట్లే కని పించు చున్నదఁట.

పిల్ల- ఈ తోకచుక్కలు రావడం మంచిదేనా?

మాస్ట- మంచిదనే వాడుక, అదేమి మంచో? కరువో, కాటకమో, వుపద్రవములో, వచ్చునని అందఱకు భయము. దానికి సాయఁ మొన్నటిచుక్క కనిపించ గానే యెడ్వర్డు చక్రవర్తిగారు నెల తిరగకుండా చనిపోయినారు. ఇది అందఱకు తెలిసినదేకదా?

(అంత బంట్రోతు త్వరగాప్రవేశించి) మాస్టరుగారూ: యినస్పెక్టరుగారు వస్తున్నారు.

మాస్ట-(తొందరగా) ఏరీ?

బంట్రో-వారుగో వస్తున్నారు. ఇప్పుడే మీాబడి పరీక్ష చేస్తారట పిల్లలందఱినీ సిద్ధంగా వుంచమన్నారు.

{ అంత ఇన్స్పెక్టరుగారు ప్రవేశించి మాస్టరు పిల్లలు చేయు నమస్కారములను అందుకొని కుర్చీపై కూర్చొనును. }

ఇన్స్పె-ఏమండి? పిల్లలంతా సిద్ధంగావున్నారా?

మాస్ట-చిత్తం, సిద్ధంగా వున్నారండి.

ఇన్స్పె-మీా యెటెండెన్సు రిజష్టరేది?

మాస్ట-ఇదిగోనండి (అని రిజష్టరు నందించును.)

ఇన్స్పె-(అందుకొని పిల్లలను పిలుస్తూ ప్రజంట్లువేసి వారితో) నేనొక నోటిలెక్క అడుగుతాను, మీారందఱు కట్టండి. నేను యెవరిని అడిగితే వారే జవాబు చెప్పవలెను.

పిల్లలు-చిత్తం, చిత్తం.

ఇన్స్పె-1 పుస్తకంవెల రు1-15--0లు ఐతే, 32 పుస్తకముల వెల యెంత? (ఒక పిల్లవానినిచూచి) నీవు?

పిల్ల- రు 31-8-0లు, (అని జవాబుచెప్పును.)

ఇన్స్పె-మఱివొకటి, జాగ్రతగావినండి. 1 పుస్తకము, 1 పలక,

కలిసినవెల రు 2-3-0లు. పలకవెలకంటె పుస్తకమువెల రు 0-9-0లు అధికం అయితే పుస్తకంవెల యెంత?

(కొంచెముసేపుతాళి మఱియొక పిల్లవానిని చెప్పుమనును.)

పిల్ల- రు 1-6-0లు.

ఇన్స్పె-అబ్బాయి! నీవ్వొక పద్యంచదువు? (అని ఒకనిని చూపును)

పిల్ల- ఏదో ఒక పద్యమును చదువును.

{వాచకములోని 2-3 ప్రశ్నలను అడుగును, పిల్లలు జవాబు చెప్పుదురు.}

ఇన్స్పె-(మాస్టరువంకచూచి) 1 పాట పాడించండి?

మాస్ట- చిత్తం. (అని పిల్లలచేత) ఏదోపాట పాడించును.

ఇన్స్పె- (మాస్టరుతో) అయ్యా: ఇక వీరిని పంపించి వేయండి.

మాస్ట- చిత్తం. (అని పిల్లలను పంపివేయును. వారునిష్క్రమింతురు)

ఇన్స్పె- మీ నోటుబుక్కు యేది?

మాస్ట- ఇదిగోనండి. (అని నోటుబుక్కు నందిచును.)

ఇన్స్పె- {అందుకొని వ్రాతనభినయించును. కొందఱు బ్రాహ్మణులు ప్రవేశింతురు.}

ఇన్స్పె-అయ్యా ; మహాశయులకు నమస్కారములు.

బ్రాహ్మ-చిత్తం, చిత్తం, (అని పువ్వులిచ్చి కూర్చుందురు.)

ఇన్స్పె-(వ్రాసిన రిమార్కు బుక్కుచేత పట్టుకొని చూచుచు.)

ఈతేదీని స్కూలు తనిఖీ చేయఁబడినది. స్కూలు మంచి అభివృద్ధిదశలో నున్నది. క్రొత్తపద్ధతుల ప్రకారం చాలభాగములు జరుగుచున్నవి. అన్నిపాఠములకు తగిన ఉపకరణములను ఇంకను అభివృద్ధి చేయవలెను. క్రొత్తపద్ధతుల ప్రకారం యేర్పరుప వలసిన కాలనిర్ణయ పత్రికలు, రిజిష్టర్లు సరిగాను పూర్తిగాను వున్నవి. మాస్టర్లు శ్రద్ధగాపనిచేయుచున్నట్లున్నది. పిల్లలకు డ్రాయింగు ఇంకా బాగా నేర్పవలెను. తోటను మంచి అభివృద్ధిలోనికి తేవలెను. మొత్తము పైని చాల బాగా యున్నది. (అని నోటుబుక్కును ఇచ్చివేయును మాస్టరు అందుకొనును)

బాబ్రహ్మ-అయ్యా: విశేషంగా మనివి చేయడం యెందుకు? స్కూలును అభివృద్ధి చేసే పూచీ తమది. మేష్టర్ల విషయమై తమకు తెలియని దేమున్నది? పూర్వపు మహారాజులు అన్నవస్త్రా లిచ్చేవారు. ఇప్పుడు గవర్నమెంటువారు పిల్లలకు విద్య నిప్పిస్తున్నారు. వీరికి సర్వేకూడా నేర్పించితే మహాబాగా వుండును. అందరికీ తెలిసి వుంటే మరి యీకాలంలో తగాయదాలుండవు. ఇప్పుడెక్కడ చూసినా భూవ్యఁలను కొలుచుటే గదా? అందుకై మనివిచేసు కొన్నాము.

ఇన్స్పె-దీనికే మున్నదండి? ఇంతకూ గ్రామస్థులకు శ్రద్ధవుండ

వలెను. విద్యను మించిన లాభము ఇంకొకటి లేదని తమ పిల్లలకు బోధ పఱచుచుండ వలెను. పిల్లవాఁడు బడినుండి రాగానే తల్లిగాని, తండ్రిగాని, అన్నదమ్ములుగాని, కొంచెము శ్రద్ధతో క్రొత్తపాఠములను తిరిగీ చక్కఁగా బోధించి దాని జవాబులను వాని చేతనే చెప్పించ వలెను. వేయేల? ఒక సూక్ష్మమైన సంగతి వినండి. పిల్లవానికి క్రొత్తపాఠములను బోధించుట లోను, పాతపాటిని ఒప్పగించుకొనుట లోను, బడికిని ఇంటికిని భేదము కనుపడ కూడదు. అట్లున్న వానికి ఆట పాటలకు అవకాశము కలుగక విద్యయందు ఆసక్తి మెండయి ఉత్సాహము కలుగును. ఇంతకంటే యెవ్వరు చెప్పవలసినదీ యేమీ లేదు.

బ్రాహ్మ-చిత్తం, చిత్తం, చక్కఁగా శలవిచ్చినారు.

ఇఁస్పె-అందఱి కాపురస్థలము ఇదేనండీ?

బ్రాహ్మ-అవునండి. ఇంకా మావారందఱు విద్యానగరమునకు వెళ్లినారండి.

ఇఁస్పె-ఎందుకు?

బ్రాహ్మ-కళాశేఖర ప్రభువుగారికి రేపటిదినం యౌవరాజ్య పట్టాభిషేకమహోత్సవము, అందుచేత.

ఇఁస్పె-వా రెప్పుడు వచ్చినారు?

బ్రాహ్మ-మొన్ననే.

ఇన్స్పె-వారికి పెండ్లి అయినదా?

బ్రాహ్మ-ఈమధ్యనే కాశ్మీరదేశంలో శ్రీనగరం రాజుగారి కుమార్తె "కళావతి" అనునామెను పెండ్లాడిరి.

ఇన్స్పె-సంతోషము, సంతోషము.

బ్రాహ్మ-(లేచి) ఇక మాకు శలవు దయచేయించండి.

ఇన్స్పె-చిత్తం, (బ్రాహ్మణులు నిష్క్రమింతురు.)

ఇన్స్పె-(మాస్టరువంకఁజూచి) అయ్యా; వారికార్డును బస లోనికి తీసికొని రండి. అక్కడ చూడ వచ్చును. (అని లేచును.)

మాస్ట-చిత్తము. (అందఱు నిష్క్రమింతురు.)

ఇది శ్రీమదార్యసోమయాజుల

లక్ష్మీనారాయణశాస్త్రి.

లక్ష్మీనరసింహాంగార్లచే

రచియింపఁబడిన.

కళాశేఖర చరిత్రమునందు.

పంచమాంకము.

శ్రీ

# కళాశేఖర చరిత్రము.



## షష్ఠాంకము.

1. స్థలము-విద్యానగరములోని అంతఃపురప్రాసాదము.

(అంత కళాశేఖరుఁడును, కళావతియు ఉపవిష్టులై ప్రవేశింతురు)

క, డు- ప్రేయసీ! లోకములో భార్యాభర్తలను ఎట్లుగా తలంపవలెను?

క, తి- ఆర్యపుత్త్రా! భార్యకు భర్తయే గురువులలోకెల్ల గురువు. భార్య భర్తకు సహధర్మిణి. ఆమె ఆయనను దేవునిగాభావింపవలెను. అతనిసౌఖ్యమే ఆమెసౌఖ్యము. కర్తవ్యము నిర్ణయించుట భర్తవిధి. దానికి సాహాయ్యము చేయుట భార్యవిధి. ఇదె స్త్రీజాతికెల్లను ముఖ్యమైన ధర్మము.

క, డు- ప్రేయసీ! చక్కఁగా చెప్పితివి. భార్యయే భర్తయొక్క శక్తి సుమా.

క, తి- ఆర్యపుత్త్రా! అదెట్లు?

క, డు- భార్యయందు తన ప్రతిబింబమును చూచుట వలనను,

తన మనోభావములు ఆమెయందు ప్రతిధ్వనించుట వలనను భర్తయొక్క శక్తివృద్ధి యగును.

క,తి- పురుషు లందఱు అట్లు చేయుచున్నారా?

క,దు- ప్రస్తుతము అతిబాల్య వివాహములు కన్యాశుల్కములు మొదలైనవి అధికమగుటచే కష్టముగా నున్నది.

క,తి- ఆర్యపుత్రా! ఎట్లైనను భార్యాభర్త లొకటేగదా కష్టమేమి?

క,దు-ప్రేయసీ! మనుష్యులకు ధనమందు కోరిక మెండు. దరిద్రము అన్నిగుణములను పోగొట్టును, దాని బాధకై తెలిసినవారు కూడ పుత్రికబిడ్డలను కులము, నడత, మర్యాద, తెలివి, మొదలగు గుణములను వరునందు విచారింపక యెవ్వనికో విక్రయించుటచే పిమ్మట ఆ దంపతులకు మనస్సులు కలియక వేరగును. దానికి తోడు ఆడువారికి విద్యలేకుండుట. ఇవె కారణములు.

క,తి-నిజమే, ఆర్యపుత్రా! చదువుకొన్న ఆడువారి కడుపున పుట్టినపిల్లలు గొప్ప బుద్ధిమంతులగుదురని శాస్త్రములు చాటుచున్నవి. పూర్వము సావిత్రి, సీత, దమయంతి, ద్రౌపది, మొదలగుమహారాజ పుత్రికలు కూడచదువుకొన్నట్లువారివారిచరిత్రములవల్లనే తెలిసికొనవచ్చును.

వసిష్ఠాది మహర్షులవలె పూర్వము అత్రివంశమున పుట్టిన 'విశ్వవార' అను స్త్రీరత్నము ఋగ్వేదము లోని కొన్ని మంత్రములను కనిపెట్టెను. అట్లే "సూర్య" అను స్త్రీరత్నముకూడ కొన్ని వేదమంత్రములను కనిపెట్టెనని వింటిమి. మైత్రేయి, గార్గి, సులభ మొదల గువారు పరపత్తులలో చేరి తమశాస్త్రనైపుణ్యమును చూపిరట. ప్రస్తుతము మనదేశములో అదే తక్కువ.

క, డు-ప్రేయసీ! చక్కగా పల్కితివి. అమెరికా, ఐరోపా, మొదలగు ఇతర ఖండములనుండు స్త్రీలందఱు విద్యావతు లగుటచేతనే వారిపిల్లలు అత్యద్భుతమైన విషయములను కనిపెట్టుచు, దేశంబులేలుటకు సమర్థులైయుండుటే నిదర్శనము కదా? పురుషునకు భార్య సగము శరీరముగను, ఉత్తమ స్నేహితురాలుగను, ఉండి ధర్మము, అర్థము, కామము, మోక్షము, అను 4 పురుషార్థములకు మూలకారణ మగునని మనువాక్యము కలదు.

క, తి-యోగ్యమైన రూపము, గుణము, వయస్సు, నడువడి, కల భార్యను విడిచిన పురుషునకు ఏమైన శిక్షకలదా?

క, డు-ప్రేయసీ! "అదుష్టాం వినతాం భార్యాం, యౌవనేయః పరిత్యజేత్ సప్తజన్మ భవేత్ స్త్రీత్వం, వైధవ్యంచ పునః పునః" అనగా, పతికి లోబడిన బుద్ధిమంతురాలగు భార్యను యౌవనమందు ఎవడు విడిచిపెట్టునో,

వాఁడు ఏడుజన్మములవరకూ ఆడుదై పుట్టుచు ప్రతిజన్మములోను చిన్నప్పుడే వైధవ్యమును పొందునని దక్షస్మృతియందు చెప్పఁబడియున్నది.

క,తి-ఆర్యపుత్రా! దైవము మంచి శిక్షవిధించెను. తమకే స్వతంత్రము కలదని అట్లు నడచెడి దుర్మార్గులకు ఈ స్మృతివాక్యమును బోధించిన నిరపరాధినులగు స్త్రీలకు ఇట్టి గోడు లేకుండునుగదా?

క,డు-ప్రేయసీ! అనుభవమువంటి దేదియు కాదు. మూర్ఖులను బోధించుట కెవ్వరితరము ?

క,తి-ఆర్యపుత్రా! మనదేశమునందువలె ఇతరదేశములందును ఆయాజాతులకు తగినట్లు సౌందర్యము ఉండునా?

క,డు-ఆహా! ఎక్కడైనా స్త్రీలే సౌందర్యమును కోరువారైయున్నారు. ఆభరణములవల్లనే సౌందర్యముకలుగునని తలంచుట మాత్రము వెఱ్ఱితనము.

క,తి-ఆర్యపుత్రా! అదెట్లు?

కడు-ప్రేయసీ! చీనా, జపాన్, దేశములవారికి జారుకన్నులు అతి సౌందర్యము. కొచ్చిన్ చీనావారికి కుంద్రని ముఖము అందము. సయాందేశీయులకు చిన్నముక్కును, లావైన పెదవులును, వెడల్పైనముఖమును, పెద్దనోరును, పెద్దవిగాకనుబడు ముక్కురంధ్రములును,

అందము. ఆఫ్రికాఖండము వారికి గొప్ప పెదవులు అందము. నీగ్రో, మూర్, కాఫర్, జాతులవారికి నలుపు రంగును, జావాద్వీపమువారికి పసుపురంగును అందము మహమ్మదీయులకు పండ్లునల్లగానుండిన శృంగారము.

క,తి-ఆర్యపుత్రా! చాలవింతగా నున్నది? మనదేశ స్త్రీలకు నగలపిచ్చియెందు ధారిసైయెందరు మహాశయులు ఎంతెంత మనోవ్యధల పాలగుచుండిరో అనుభవనీయులకే యెఱుక; సహజసౌందర్యము ప్రధానము. దానికి నిదర్శనము నాచుచే చుట్టఁబడిన పద్మమే.

{అంతఃకంచుకి ప్రవేశించి. జయము, జయము, యువరాజుగారికిని, కళావతీ దేవిగారికిని.}

క,డు-భద్రక! ఏమి విశేషము?

కంచు-మహారాజునాజ్ఞ యైనది తమ్ము తోడ్కొనిరమ్మని.

క,డు- ఏమిచేయు చుండిరి?

కంచు- నిండు కొలు వుండిరి.

క,డు- మంచిది. (భార్యనుజూచి.) ప్రేయసీ! నాయనగారి దర్శనము చేసి వచ్చెదను.

క,తి- చిత్తము, ఆర్యపుత్రునాజ్ఞ; (అని నిష్క్రమించుచు.)

క,డు- భద్రక! మార్గముఁ జూపుము.

కంచు- చిత్తము-యువరాజుగారి యాజ్ఞ; ఇటు, ఇటు, దేవా.

(అందఱు నిష్క్రమింతురు.

2. స్థలము-గుణసాగిర మహారాజుగారి సభాస్థానము.

(అంత గుణసాగర మహారాజును, కళాశేఖరుఁడును, సుమంతుఁడును, సుబుద్ధియు, రామశాస్త్రియును, ఆసనములపై ఉపవిష్టులై ప్రవేశింతురు.)

గుణ-సుమంత! చిరంజీవులు భద్రముగా నరుదెంచుటచే కృతార్థులమైతిమి. జన్మసాఫల్య దినము నేడెయని తలంచెద. కాలము బ్రహ్మామువలె ఎంతబలీయమై ఒప్పుచున్నది?

సుమ- మహారాజ! సర్వజ్ఞుఁడగు కళాశేఖరుండు సాక్షాత్తుశశికళాశేఖరుండనుటకు సందేహాము లేదు.

సుబు- ఇది నిజము. ఇతర ఖండముల వారును ఇట్లే వార్తాపత్రికలలో కీర్తించిరి.

గుణ- (కళాశేఖరుని చూచి) నాయనా! నీసంభాషణ వినుటకు చాల సంతోషము కలుగుచున్నది?

కళా- చిత్తము, నాయనగారి యాజ్ఞ; దేశ పరిపాలన మునకు చట్టములు ముఖ్యము. బ్రిటిష్ గవర్న మెంటువారు ఎల్లప్పుడు చట్టములను అతిక్రమించి నడచుట లేదు.

సుబు-పూర్వపు మహారాజులేమి మొగలాయి ప్రభువులేమి ఇట్టి యేర్పాటులు ఎఱుంగరా?

శా- మొట్టమొదట మనువే ఇట్టి కట్టుదిట్టములను ఏర్పఱచెను. మొగలాయి ప్రభువులకు చట్టము లక్కఱలేదు.

న్యాయాన్యాయములు వారి వారి చిత్తానుసారము. బ్రిటిష్ పాలనములో హైకోర్టు తీర్పునకు రాజప్రతినిధి యైనను కట్టుపడవలసినదే. అందుచేత ఇది ధర్మశాస్త్రమునకు లోబడిన రాజ్యపాలనము అనంబడును ఇంక రెండవది, సైన్య సంరక్షణము. అది లేని రాజు రెక్కలులేని పక్షికదా ?

సుబు- యువరాజుగారు సెలవిచ్చిన సంగతులు మిక్కిలి పొగడ తగినవి.

సుమ-మంచిపాలన మునకు మొదటి యాధారము ప్రజల దేశభక్తి, రాజభక్తులే కదా ?

గుణ- జాతి, మత, భేదములను పాటింపక సర్వసమత్వమును వహించిన ప్రభువుల ప్రభుత్వము రాణించును.

కళా-అట్లు కానియెడల గవర్నమెంటువారికి పన్నులవల్ల వచ్చు 1244 కోట్ల రూపాయిలు వసూలగుట యెట్లు ?

రామ-మహాప్రభో! 1244 కోట్ల రూపాయిలే? ఇంతసొమ్ము వసూలుచేసి యేమిచేయుదురు ? ఎందుకు యీలాగు వసూలుచేయవలెను?

కళా-ఉత్తమ రాజ్యపాలనమునకు ఖర్చు మెండు. అవియిక్కడే దేశోపయోగముల క్రింద ఖర్చగును. సుమారు60 సం॥ లలో ల్యాండు రివిన్యూ రెండింతలు పెరిగినది. మునుపటి

కంటెభూము లధికముగా సాగుబడి చేయబడుటయే దీని
కారణము.

సుబు-గ్రామ మున్సబు చేయు కార్యములేవి?

కళా-తన గ్రామములో జరుగు కొట్లు, తిట్లు, మొదలగు క్రి
మినల్ నేరములను విచారణచేసి తీర్పు చేయుట, ఏనా
ది ఎఱుకులవంటి తక్కువజాతి వారికి కొన్నిగంటలు
బండకొయ్య మొదలగు నిర్బంధశిక్షలు మాత్రం విధిం
చుట, తన అధికారమునకు మించిన క్రిమినల్ నేరము
లను, ఇతరుల నేరములను, తాను విచారణచేసి పైవారికి
పంపుట, ఇవి.

సుమ-బ్రిటిషు గవర్నమెంటునకు పూర్వము గ్రామమున్సబు
గ్రామమునకు సర్వాధికారిగానుండి అతని యిష్టప్రకా
రము ఎంత గొప్పశిక్షనైనా చేసేవారంటనే?

కళా-అవి పూర్వపు మాటలు.

సుమ-ఇప్పుడో?

కళా-ఇప్పు డతను చట్టమునకు లోబడి తన అధికారమును
కొంచెమైన దాటకూడదు.

గుణ ఇతని మీాద క్రిమినల్ అధికారియెక్కడ నుంటును?

కళా-తాలూకా టవునులో.

సుబు-వారి బిరుదేమి?

కళా-స్టేషనరీ సబ్ మేజస్ట్రేటనియు, స్పెషల్ మేజస్ట్రేటనియు.

సుబు-ఎట్టివారు ఈపనిలో నేర్పరుపఁబడుదురు?

కళా-సాధారణముగా బి. ఏ, ప్యాసైనవారు.

సుబు-వీరుచేయు కార్యములేమి?

కళా-తాలూకా గ్రామములలో జరుగు క్రిమినల్ నేరములన్నియు పోలీసువారివల్లను, పార్టీలవల్లను తేఁబడగా విచారణచేసి తమ అధికారమునకు లోఁబడిన నేరస్థుల నుశిక్షించుచు, సెషన్ కేసులుడిస్ట్రిక్టుజడ్జీనద్దకుపంపుట.

సుబు- శిక్షనుగాని, జరీమానా గాని విధించుటకు సబ్ మేజస్ట్రేటు గారికి ఎంత వరకు అధికారము కలదు?

కళా- 6 నెలల వరకు కఠిన శిక్షను, 200 రూపాయీల వరకు జరీమానాయును, విధించ వచ్చును.

సుబు- వీరి తీర్పులపై అప్పీళ్లు కలవా?

కళా- చట్టములకు విరుద్ధముగా చేసిన వీరి తీర్పుల మీదఁ డివిషనల్ ఆఫీసరుల వద్ద అప్పీళ్లు చేసికొన వచ్చును.

సుబు- డివిషనల్ ఆఫీసరులు చేయు పను లెవ్వి?

కళా- సబ్ మేజస్ట్రేట్ల తీర్పులపైని వచ్చు అప్పీళ్లను విచారించి తీర్పు చేయుట, తమవద్దకు వచ్చు ఒరిజనల్ కేసులను విచారించి తీర్మానించుట, తమ డివిషనుతో సంబంధించిన రివిన్యూ వ్యాపారమును చూచుట, ఇవి.

సుబు-వీరి హోదా లెవ్వి?

కళా- క్రిమినల్ కేసులకు సంబంధించి నప్పుడు జాయంటు మేజస్ట్రేటు, డిప్టీ మేజస్ట్రేటు అనియు, రివిన్యూ సైడులో సబ్ కలెక్టరనియు, అసిస్టెంటు కలెక్టరనియు, డిప్టీ కలెక్టరనియు, హోదాలు కలవు. జిల్లా కలెక్టరునకు డిస్ట్రిక్టు మేజస్ట్రేటు అనియు హోదా కలదు. నేరస్థులను 2 సం॥ ల వరకు శిక్షించుటకును, వేయి రూపాయీల వరకు జరీమానా వేయుటకును, కొరడా దెబ్బలుకొట్టించుటకును, వీరలకు అధికారము కలదు.

సుబు- పూర్వకాలమున గ్రామమున్సబు ఆ గ్రామములోని శివిల్ (హక్కుస్థాపించు కొనుట, బాకీ యివ్వనియెడల చెల్లించు నట్లు తీర్పు చేయుట, మొదలైన) కేసులను గూడ విచారణ చేయుచుండె నటనే? క్రిమినల్ నేరము లందు వలె సర్వాధికారిగా నుండెనా?

కళా- ఉండెను. ఐనా పంచాయితులని 5 గురు పెద్దమనుష్యులను ఉభయపార్టీలవారు కోరుకొనఁగా వారు 5 గురు నుచేరి విచారణచేసి తీర్పు చేయుచుండిరి.

సుబు- ఇప్పుడు గ్రామమున్సబుఎంతవరకు తీర్మానింపవచ్చును?

కళా- 20 రూపాయిలవరకు.

సుమ- వీరిపైని అధి కారులు కలరా?

కళా- డిస్ట్రిక్టు మున్సబుగారు కలరు.

సుమ- వా రెంత వరకు తీర్పు చేయుదురు?

కళా- 2 వేలరూపాయిల వరకు గల వ్యవహారమును.

సుమ- ఆపైని ఏమి చేయవలెను ?

కళా- డిస్ట్రిక్టు జడ్జీగారివద్ద దాఖలు చేసికొనవలెను.

సుమ- అంతతో సరియా ?

కళా- లేదు. వారి తీర్పు సరికాదని తోచినవారు హైకోర్టునకు అప్పీలు చేసికొనవచ్చును.

సుమ- వారిపైని అప్పీళ్లు కలవా ?

కళా- లేకేమి ? 10 వేలరూపాయిలకు పైబడిన యెడల అట్టి తీర్పుమీఁద యింగ్లండులో ప్రీ, వీ, కౌన్సిల్ అప్పీలున్నది. ఇట్లే మెట్లు మెట్లుగా న్యాయ సభ లున్నవి.

గుణ- ఏరాజ్య మందును మును పెన్నఁడును ఇన్ని మెట్లుగల న్యాయ పాలనము లేదు.

సుమ- దేవ! ఈకాలమున ప్రజలలో అన్యాయ వంతు లెందఱో ఈ న్యాయసభల వల్లనే తెలియుచున్నది ఇట్టి న్యాయసభలు లేకున్న మనుష్యు లొకరినొకరు తినివే యరా ? గవర్న మెంటువారు చేయు సదుపాయము లిన్నియని చెప్పుట కెవ్వరి తరము?-ఈదేశములో నాణ్యములు చిరకాలము నుంచియు చెల్లుచున్నవని ప్రసిద్ధి కలదు. కాని ఆకాలమున యంత్ర సాహాయ్యము లేక పోవుటచే అంత సొగసైనవికావు. ఇప్పుడో; బంగారు,

వెండి, రాగి, మొదలగు లోహములతో నాణ్యములు ముద్రించుచున్నారు. ఇదిగాక కాగితములే నోట్లుగా చేయఁబడి నాణ్యములకు బదులుగా వాడబడుచున్నవి.

గుణ. అవి యెంతవరకు వాడబడుచున్నవి?

సుమ- 5 రూపాయలు మొదలు 10 వేలవరకును. వర్తక వ్యాపారమునకు నోట్లుచాలా సదుపాయము. ఎంత సొమ్మయినను నోట్లుగామార్చి సులభముగాను, క్షేమముగాను, ఒకడు తీసికొని పోవచ్చును. ఈ బ్రిటీషు రాజ్యములో ఎక్కడనైనను అవి చెల్లుబడి యగుటకు సందేహాము లేదు.

గుణ- జనుల స్వతంత్రపాలనలో చేరినవేవి?

సుబు- మహారాజ! గొప్పగ్రామములయొక్క మున్సిపాల్టీలు, యూనియనులు.

గుణ- అదెట్లు?

సుబు- ప్రతియూనియనుకుగాని, మున్సిపాల్టీకిగాని, ఆగ్రామస్థులలో నొకగొప్పవారు ఆగ్రాసనాధిపతిగను, మరి కొందఱు సభ్యులుగను, నిర్ణయింపఁబడి యూనియన్, లేక మున్సిపాల్టీ, సభయను పేరుతో ఆగ్రామమును పాలించుకొనుచున్నారు

కళా- యూనియనుకును, మున్సిపాల్టీకిని గలభేదమేమి?

సుబ- రెండును ఒక్కటియే కాని మునిసిపాల్ టీకంటె యూనియను అధికారమునందు కొంచెముతక్కువ.

గుణ- ఈసభ్యులు జనులవల్లనే యేర్పాటు చేయఁబడుదురా?

సుబ- అదే యుద్దేశము, ఐనను జనసంఘములో విశేషము విద్య లేనివారుండి తమ మేలుకీడులను తెలిసికొని చక్కగా నెరవేర్చుకొనజాలరని గవర్నమెంటు తరపున కలెక్టరు మొదలగువారే సదరు సంఘములోని మెంబర్లను, చైర్ మేన్నును, నియమించుచున్నారు.

గుణ- వీరేమి చేయుదురు?

సుబ- అప్పుడప్పుడు మీటింగులు చేయుచు, ఆయా గ్రామములకు ఆరోగ్యప్రదములగు పనులను చర్చించుచు, వానిని నెరవేర్చికొనుచు, పాలించుకొనుచున్నారు.

గుణ- వీరికి సర్వస్వతంత్రము కలదా?

సుబ- జిల్లా కలెక్టరుగారికి లోఁబడి వారి యనుమతిచొప్పున చట్టప్రకారము నడువవలెను

గుణ- వీరివలన గ్రామములో జరుపఁబడవలసిన పనులెవ్వి?

సుబ- వీధులలో రోడ్లు వేయించుట. అచ్చటచ్చట లాందర్లుంచి చీకటికాలములో దీపములు పెట్టించుట. నీటివసతి లేని గొప్పపట్టణములలో కొళాయిలుంచి పట్టణమంతటికిని మంచినీటిని వ్యాపింపచేయుట. హాసుపత్రులుంచి రోగు

లకు సాహాయ్యముచేయుట. టీకాలువేయించి మశూ
చికపు బాధను తప్పించుట. అందఱకు విద్యలభించు
నట్లు ప్రైమరీ పాఠశాలలను స్వయముగా పెట్టియు,
గ్రాంటు నిచ్చి యితరులచేత పెట్టించియు,విద్యాభివృద్ధి
కలిగించుట. గ్రామములో మురికి, మైల, లేకుండ నూ
డ్పించి దూరముగ తీసికొనిపోవుటకు తగిన యేర్పా
టుచేసి కలరా మొదలగు అంటువ్యాధులు రాకుండ
ఆటంకపఱచుట. వచ్చినపుడు జనులకు తగిన సాహా
య్యముచేసి వారిని కాపాడుట మార్కెట్లుకట్టించి వ్యా
పారము వృద్ధిచేయుట. ఇవి.

గుణ- ఇట్టి యూనియనులకున్ను, మున్సిపాలిటీలకున్ను, ఖర్చులకు సొమ్మెక్కడిది?

సుబ- ఇండ్లమీఁదను, జంతువులమీఁదను, వృత్తులమీఁదను, బండ్లమీఁదను, పన్నులువేసి వసూలుచేసిన మొత్తమును ప్రోవిన్షియల్ ఫండునుండి మున్సిపాలిటీవారును, లోకల్ ఫండునుండి యూనియనులును, పొందుచున్నారు.

గుణ- పబ్లికు పనులగు రోడ్లు, కాలువలు, వంతెనలు, పబ్లికు ఆఫీసుల కట్టడములు, రహదారి బంగళాలు, గవర్నమెంటు సత్రములు, మొదలగు పనులను ఎవరు చేయుదురు?

సుమ- మహారాజ! ఇర్‌జనీరింగు డిపార్టుమెంటువారు.

గుణ- వీరింకను ఏమైన సదుపాయములు చేయుదురా?

సుమ- ప్రాతపడిన వాటిని మరమ్మత్తుచేయించుట, పొలముల కు నీళ్లిచ్చుచుండుట, వీరి పనియైయున్నది. సాధారణ ముగ ప్రతి తాలూకాలోను ఒక ఓవర్‌సియరుండి వీటి నన్నిటిని చేయించుచుండును. మఱియొక వింత; ఈ డిపార్టుమెంటువారు గొప్పగొప్పనదులకు ఆనకట్టులుకట్టి కాలువలు త్రవ్వించి వర్షము లేకపోయినను దేశము పండునట్లు వసతులు చేయుచున్నారు. ఇదిగాక రైల్వే యింజనీరింగ్ డిపార్టుమెంటు కలదు.

గుణ- దీనికి ఖర్చు లెక్కడివి?

సుమ- ఈ డిపార్టుమెంటునకు ఖర్చు మెండుగ అగుపడుచున్న ను ఖర్చులుపోగా చాలసొమ్ము మిగులుచున్నది.

సుబు- పూర్వపు గ్రామముల సభల పాలన మెట్లుండెడిది?

సుమ- ఒక కుటుంబమువారు ఇంటి పెద్దకెట్లో, గ్రామస్థులు గ్రామాధికారికి అట్లే, లోబడుచుండిరి

సుబు- ఏలనో?

సుమ- అతండే పన్ను వసూలుచేయు కలెక్టరును, న్యాయపా లనముచేయు జడ్జియు, అయి యుండుటచేత.

సుబు- సాహాయ్యులు కలరా?

**సుమ-** కలరు. కరణము, వెట్టి తలారులు.

**సుబు-** తరువాతి జాతులలో?

**సుమ-** కంసాలి, కమ్మరి, కుమ్మరి, సాలె, చాకలి, మంగలి, మొదలగు జాతులవారు వారివారి వృత్తులనుండి సాహాయ్యము చేయుచు గ్రామాధికారికి లోఁబడుచుండిరి.

**సుబు-** ఆయా వృత్తులవారు తమతమ వృత్తులవెనుక మరుమేలు చేయుచుండుట కలదా?

**సుమ-** తప్పక కలదు.

**సుబు-** మంచి కట్టుబాటు.

**కళా-** అధికారి సర్వతంత్ర స్వతంత్రుఁడు.

**గుణ-** హనుంత! ఆ యుష్మంతునకు రాజనీతిసారమును బోధింపుము.

**సుమ-** చిత్తము మహారాజునాజ్ఞ! (కళాశేఖరునితో) భర్తృదారక! సకలవిద్యలు నేర్చినను, దేశాటనము సల్పినను, రాజ్య తంత్రమునందు అనుభవముచే తెలియతగిన విషయములు పెక్కుగలవు. రాజు మొట్టమొదట ఇంద్రియములను గుఱ్ఱములను వశపఱచుకొని వానిపై నెక్కి కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, అను లోపలిశత్రువులను జయించి మొదట తన్నే జయింపవలెను. అట్లు చేసిన ఇతరు

లను జయించును. తన్ను తానుజయింపలేనివాఁడు ఇత రులను ఎట్లుజయించును? పిమ్మట చతురులైన మంత్రులను—యాగాదికర్మలు చేయించుటయందు సమర్థుఁడు, తపస్వియు నగు పురోహితుని ఏర్పఱుచుకొనవలెను. భయము, లోభము ధర్మము మొదలగువానియందు యుక్తిచేత పరీక్షింపఁబడిన మంత్రులను తారతమ్యము తెలిసి కార్యములయందు నియమించవలెను. వారిమాటలు విరోధముతోఁ కూడినవో స్నేహముతోఁ కూడినవో వారి రహస్య సంభాషణలచేత తెలిసికొనవలయును. నిజమునకు సంతోషింపవలెను, అబద్ధమును దండింపవలెను. వారి నడవడిని యెల్లప్పుడు చారులవలన తెలిసి కొనుచుండవలెను. ఈ ప్రకారము రాజు కన్నులుమూసికొనక కార్యాకార్యములను చూచుచు దుర్మార్గులను వెళ్లగొట్టి ధనమును సేనను ఆర్జించి ధైర్యవంతుఁడై యుండవలెను ప్రభుత్వము, మంత్రము, ఉత్సాహము అను మూఁడుశక్తులు గలవాఁడై యెదిరి యొక్కయుతనయొక్కయు తారతమ్యమును ఆలోచించుకొని పరదేశమును జయించుటకు ప్రయత్నింపవలెను. ఆప్తులు తెలిసినవారు వివేకులు అగు వారితో రాజ్యపుదానినిగుఱించి మంత్రాలోచనముచేసి వారు నిశ్చయించినదానిని స్వబుద్ధిచేత సర్వమును విమర్శ చేయవలెను సామము,

దానము, భేదము, దండము, అను నాలుగుడేపాయ
ములను, ఎఱిఁగి తనయొక్కయు ప్రజలయొక్కయు యో
గక్షేమములయెడల జాగరూకుఁడై, సంధి, విగ్రహము
మొదలగు ఆఱుగుణములను ప్రయోగింపవలెను ఈప్ర
కారము యేమరుపాటులేక స్వదేశ పరదేశములను గు
ఱించి చింతించుచుండు రాజు జయమే పొందునుగాని
ఎప్పుడును అపజయము పొందడు.

సుబు- యువరాజ! తెలియనివాఁడు కామలోభములచే గ్రుడ్డి
వాఁడై తప్పుదారులు చూపు మోసపునాకర్లచేత గో
తులలో త్రోయఁబడి కొల్లపెట్టబడుచున్నాఁడు. పంట
కాపులచే వెలుగు కట్టఁబడిన వరిచేనియొద్దకు ఎట్లుపోవు
టకు శక్యముకాదో ధూర్తులు చుట్టుకొనియున్న రాజు
చెంతకు పోవుటయును అట్లే శక్యముకాదు. వారు ర
హస్యములలో ప్రవేశించి రాజును తమ స్వాధీనునిగా
చేసికొందురు. అంతట సిరి తారతమ్య మెఱుఁగని అత
నియొద్దనుండి ఖిన్నురాలై అవతలికి తొలగిపోవుచున్న
ది. కనుక రాజు తగినట్లుగా దండించువాఁడై ఆత్మను
జయించి తారతమ్యమును తెలిసినవాఁడు కావలెను.
ప్రజానురంజనముచేత అతఁడు సిరికిపాత్ర మగును. తన
యందు భక్తులును, రాజనీతి మర్మములు తెలిసినవారు
ను, పాపమునకు భయపడువారును, మంచివంశము,నడు

వడి కలవారును, నేర్పుగలవారును, విద్వాంసులును, అయినమంత్రులను సంపాదించి బలమైనకోటయు ధనమునుకలిగి ప్రజలను అనురక్తులనుగా చేసికొని క్రమక్రమముగా రాజ్యము చేయుచుండినయెడల అతనిమీఁదికి చక్రవర్తులువచ్చినను అతఁడు భంగముపొందఁడు. ఇట్టి విచారమును చింతయు రాజ్యములో సారము. ఇంత కన్న అధికమేమున్నది?

కళా- ఆర్య! సంతోషము. (అంత పురోహితులు ప్రవేశించి) మహారాజ! సుముహూర్త సమయము సమీపించినది

గుణ- అన్నియు సిద్ధముగా నున్నవి.

పురో- విశ్వేనామ రూపాభ్యాం యాదేసి సర్వమంగళా।
తయోస్సం స్మరణాత్పుంసాం సర్వతో జయమంగళం॥
(అని పఠింతురు)

గుణ- (కళాశేఖరుని సింహాసనముపై కూర్చుండ నియోగించును.)

బ్రాహ్మ- 'శతమానంభవతి' (అని ఆశీర్వదించి అక్షతలను నిడుదభుజముపై చల్లుదురు. తెరలో మంగళధ్వనుల

సుమ-
సుబు- } స్వస్తి గుణనిధాన, యో, సత్కుల ప్రసూన,వి।
ధ్వస్తదురభిమాన, అ, భ్యస్తనృపవిధాన॥ స్వస్తి!

గుణ- నాయనా! ఇంక నీకేమికావలయును?

కళా- కోరికలన్నియు నేఁ డీడేరినవి. ఐన నిట్లగుగాక. కాలముఖమున వర్షములు కురిసి భూమిసస్యములతో నిండి యొప్పుగాక. లోకులు సుఖస్థితి నొందుదురుగాక. ప్రభువులు న్యాయరీతిని జగత్తును పరిపాలింతురుగాక. కవీంద్రుల వాక్కులు మాననియమై నిరంకుశత్వమున వర్తిలుగాక.

గుణ- అట్లే అగుగాక. (అందఱు నిష్క్రమింతురు)

ఇది శ్రీమ దార్యసోమయాజుల

లక్ష్మీనారాయణశాస్త్రి,

లక్ష్మీనరసింహాంగార్లచే

రచియింపఁబడిన

కళాశేఖర చరిత్రమునందు.

షష్ఠాంకము

సంపూర్ణము.

# సూత్రధారుని యుపన్యాసము.

ఆర్యులారా!

శ్రీమంతంబగు మన హిందూదేశంబున నాటకరచన చిరకాలముక్రిందటనే ప్రసిద్ధి వహించినది. వేదంబులు నాందీవాదంబులుగను, శ్రీధరుండు సూత్రధారుండుగను, కూటస్థుండు నాయకుండుగను, ప్రకృతి నాయికగను, ప్రాణులు పాత్రములుగను, యుగంబు లంకంబులుగను, ముక్తిఫలంబుగను, లోకమను నాటకము తొలుత సృష్టికర్తచే సృజింపఁబడినదని తెలుపుటకై కాళిదాసాది ప్రాచీన మహాకవు లిట్టి రచనఁ బ్రారంభించిరి. మహాకవుల హృదయముం దెలిసికొని ఆయా రసంబులఁ బ్రదర్శించుట సంగీత సాహిత్యంబుల నసమానులగు చతురమతులకుం గాక యితరులకసాధ్యంబు. మేము విద్యార్థులమగుటచే శారదాదేవిపై భారము వైచి మాగురువుల యుపదేశ మహిమంబున ఇట్టి మహాకార్యమును సాధింప సాహసించితిమి. అప్రగల్భులమగు మా శారదా సామాజికుల పట్ల దయామయ హృదయులగు సభాసదు లనురాగముఁ గలిగి లోపంబులమన్నించి మాయుద్యమము మేకోత్తరాభివృద్ధిఁ గాన సాగునట్లు అమోఘాశీర్వాదమును ప్రసాదింప వలయునని ప్రార్థించుచున్నాఁడను.

క. స్థాణునకుఁ గైటభజి
ద్బాణునకుఁ విజితకుసుమ బాణునకు జగ
త్త్రాణునకుఁ బుంగవకం
ఖాణునకుఁ మంగళంబు గావుత నెపుడున్.

గీ. శారదాదేవి మా సమాజమును మిమ్ము
విమల గుణధాము శ్రీ జార్జి ఫిఫ్తు సార్వ
భౌము నాతని సంతతి భక్తవరుల
[illegible] లాలోకనంబుల మనుచు గాత.

ఇట్లు,
సుజనవిధేయుఁడు
శారదేయుఁడు.